ఈనాడు
# ఆదివారం
3 సెప్టెంబరు 2017






# మా మంచి మాస్టారు!

# హైదరాబాద్‌లో ఇల్లు కొంటా!

తాప్సీ పన్నూ... ఉత్తరాది నుంచి దక్షిణాదికి వచ్చిన పంజాబీ అమ్మాయి. తెలుగుతోపాటు తమిళం, మలయాళం, హిందీలలోనూ నటిగా పేరుప్రఖ్యాతులు సంపాదించింది. ఇటీవల 'ఆనందో బ్రహ్మ'లో కనిపించిన తాప్సీ తన గురించి చెప్పిన సంగతులివి...

## ఇన్ఫోసిస్ వద్దనుకున్నా

పుట్టి పెరిగింది దిల్లీలో. క్లాసులో టాప్-5లో ఉండే దాన్ని. మ్యాథ్స్, ఫిజిక్స్ ఇష్టమైన సబ్జెక్టులు. ఆటలూ, ఇతర సాంస్కృతిక కార్యక్రమాల్లోనూ చురుగ్గా పాల్గొనేదాన్ని. కథక్ నేర్చుకున్నాను. 'అందం, చురుకుదనం ఉన్నాయి మోడల్‌గా వెళ్లొచ్చు'గా అని స్నేహితులంటే బీటెక్ చదువుతూనే మోడలింగ్ చేశా. కానీ నాకా కెరీర్ నచ్చలేదు. క్యాంపస్ ఇంటర్వ్యూలో ఇన్ఫోసిస్‌లో ఆఫర్ వచ్చింది. మాస్టర్స్ చేద్దామని వదులుకున్నా.

## సినిమా ఛాన్స్

మాస్టర్స్‌కి సిద్ధమవుతున్న సమయంలో సినిమాల్లో చేయమంటూ దక్షిణాది నుంచి ఫోన్లు వచ్చేవి! ఏదో ఒకటి చెప్పి తప్పించుకుందామని, 'నాకు భాష రాదు, నటించలేను' అని చెప్పేదాన్ని. 'సినిమాకి ఒకే అంటే మిగతావి మేం చూసుకుంటాం' అనేవారు. దాంతో కాదనలేకపోయాను. 'ఝుమ్మంది నాదం' నా మొదటి సినిమా. అది రిలీజవ్వకముందే మరో మూడు సినిమాల్లో ఆఫర్లు వచ్చాయి.

## భాష నేర్చుకున్నా

అడగకుండానే అవకాశాలు వస్తుండటంతో తర్వాత సినిమాలపైన మనసు పెట్టాను. తెలుగు, తమిళం నేర్చుకున్నాను. నటనపరంగానూ కొత్త విషయాల్ని తెలుసుకునేదాన్ని. కొన్ని సినిమాలకు డబ్బింగ్ కూడా చెప్పాను. ఇంటర్వ్యూల్లో స్థానిక భాషల్లోనే మాట్లాడేదాన్ని. అలా తెలుగు, తమిళ ప్రేక్షకులకు దగ్గరయ్యాను.

## బాలీవుడ్ పిలిచింది

దక్షిణాదిలో నాలుగేళ్లు పనిచేసిన తర్వాత బాలీవుడ్‌లో అవకాశం వచ్చింది. అక్కడ 'బేబీ' సినిమాలో డేవిడ్ ధావన్ నాకు మొదటి ఆఫర్ ఇచ్చారు. తర్వాత పింక్, రన్నింగ్ షాదీ, నామ్ శబానా, ఘాజీ చేశాను. మరో రెండు సినిమాల్లో నటిస్తున్నా. తెలిసిన భాష కావడంతో నటన పరంగా చాలా నేర్చుకునే అవకాశం వచ్చింది.

## ఆటలతోనే ఫిట్‌నెస్

ఫిట్‌నెస్ కోసం జిమ్‌లో బరువులెత్తడం నాకు నచ్చదు. బదులుగా ఆటలు ఆడుతూ ఫిట్‌గా ఉండటమే నచ్చుతుంది. స్కూల్ రోజుల నుంచీ స్క్వాష్ ఆడటం అలవాటు. ఇప్పటికీ రోజూ ఓ గంట ఆడుతుంటా. 'నామ్ శబానా' సినిమా కోసం పది నెలలపాటు మార్షల్ ఆర్ట్స్ నేర్చుకున్నాను. అప్పట్నుంచీ ఫిట్‌నెస్ పెరిగింది.

## ముంబయిలో సొంతిల్లు...

స్టార్ హోటల్‌లో దిగినా, పెద్ద ఇంట్లో అద్దెకు ఉన్నా సొంతింట్లో ఉండే స్వేచ్ఛ, సౌఖ్యం అక్కడ ఉండవు. అందుకే ముంబయిలో డబుల్ బెడ్‌రూమ్ ఫ్లాట్ కొనుక్కున్నా. దాని ఇంటీరియర్ నేనే డిజైన్ చేశాను. చుట్టూ పచ్చదనం ఉండే విశాలమైన ఇంట్లో ఉండాలని కోరిక. కానీ ముంబయిలో కుదరదుగా. అందుకే హైదరాబాద్‌లో అలాంటి ఒక ఇల్లు కొనాలని ఉంది.

## ఆరింటికే డిన్నర్

ఉదయం లేవగానే లీటరు నీళ్లు తాగి తర్వాత డ్రైఫ్రూట్స్ తింటా. ఆపైన ఆపిల్, బీట్‌రూట్, క్యారెట్‌లలో ఏదో ఒక జ్యూస్ తాగుతా. ఎక్కువగా వెజ్ ఐటమ్స్ తింటాను. మటన్ తినను. బ్రేక్‌ఫాస్ట్‌గా మూడు గుడ్లు, ఒక ఆమ్లెట్ తింటా. ఆకలనిపిస్తేనే లంచ్, లేదంటే తినను. మధ్యాహ్నం రెండింటికి బ్లాక్ కాఫీ తాగుతా. ఆరింటికే డిన్నర్. పప్పు, అన్నం, రోటీ, కూరలు కొద్దికొద్దిగా తీసుకుంటా. ఎనిమిదింటికి ఏదైనా సూప్ లేదంటే గ్రిల్డ్ ఫిష్ తీసుకుంటా. ఆ తర్వాత తినను.

## విహారయాత్రలు...

ఏడాదిలో ఒకసారి, లేదంటే సినిమాల మధ్యన ఎక్కువ గ్యాప్ ఉంటే విహారయాత్రలు చేస్తా. ఈ మధ్యనే నార్వే వెళ్లొచ్చా. నాకిష్టమైన పర్యాటక ప్రాంతం మాల్దీవులు. ప్రపంచంలోని ప్రసిద్ధ సముద్ర తీరాలన్నింటినీ చూసి రావాలనేది నా కోరిక!






## నిద్రపోతే చచ్చిపోతాడు!

మనిషి బతకడానికి తాగడం, తినడం ఎంత అవసరమో నిద్ర కూడా అంతే ముఖ్యం. అందుకే, బాగా నిద్రొస్తే పగటి పూటైనా అక్కడా ఇక్కడా అని ఆలోచించకుండా ఓ కునుకు తీసేస్తాం. కానీ బ్రిటన్‌లోని సౌత్‌హాంప్‌షైర్‌కి చెందిన 'లియమ్ డెర్బీషైర్' అలా అయిదు నిమిషాలు నిద్రపోయినా చనిపోవడం ఖాయం. అతడికి పుట్టుకతోనే 'కాన్‌జెనిటల్ సెంట్రల్ హైపోవెంటిలేషన్ సిండ్రోమ్' అనే వ్యాధి ఉంది. ఈ సమస్య ఉన్నవారికి నిద్రపోయేటపుడు ఊపిరితిత్తులు పనిచేయవు. దాంతో తెలియకుండానే గాలి పీల్చుకోవడం ఆపేసి ప్రాణాలు పోగొట్టుకుంటారు. ఈ కారణంతోనే లియమ్ పుట్టగానే ఎక్కువరోజులు బతకడని వైద్యులు తేల్చేశారట. ఆశ్చర్యం ఏంటంటే... ఇప్పుడా కుర్రాడికి 18ఏళ్లు. మరెలా బతికాడంటారా... ఇది లియమ్ తల్లిదండ్రులు పీటర్, కిమ్‌ల ఘనతే. వాళ్లు ప్రతిరోజూ రాత్రి కొడుక్కి వెంటిలేటర్ అమర్చి పడుకోబెడతారు. రాత్రంతా లియమ్ సరిగా శ్వాస తీసుకుంటున్నాడా లేదా అని చూసుకునేందుకు ఓ మనిషిని కాపలా ఉంచుతారు. ఇక, అనుకోకుండా నిద్రలోకి జారుకోకుండా ఉండేందుకు 24 గంటలూ లియమ్‌ని కనిపెట్టుకునే ఉంటారు తల్లిదండ్రులు. అతడి దగ్గరుండే అత్యాధునిక జీపీఎస్ పరికరం లియమ్ పాఠశాలకి వెళ్లినా ఏం చేస్తున్నా మొత్తం సమాచారాన్ని తల్లిదండ్రులకు చేరవేస్తుంది. 'మా బిడ్డ ఎంత కాలం బతుకుతాడో తెలియదు. కానీ ఆఖరి క్షణందాకా వాడిని బతికించుకునేందుకు ఉన్న ఏ అవకాశాన్నీ వదలం' అంటారు అతడి తల్లిదండ్రులు. వైద్యులు కూడా ఆశ్చర్యపోయేలా వారి ప్రేమే ఆ కుర్రాడిని బతికిస్తోంది మరి.



# లోపల...



### మా మంచి మాస్టారు!



మనిషి జీవితంలో ఉపాధ్యాయుడి పాత్ర ఎంతో కీలకం. చదువు సంధ్యలే కాక నైతిక విలువలూ నేర్పి పిల్లల వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దేది ఉపాధ్యాయులే. సేవాభావనతో తాము వృత్తికి అంకితమై విద్యార్థులను బాధ్యతగల పౌరులుగా మలుస్తారు. జీవితం పట్ల సానుకూల దృక్పథం నేర్పిస్తారు. ఉపాధ్యాయ దినోత్సవం సందర్భంగా అలాంటి కొందరు మంచి మాస్టార్ల విశేషాలు. **7**



# మీ మాట

ఈ సంచికపై మీ అభిప్రాయాలను sunday@eenadu.netకు మెయిల్ చేయవచ్చు.

### స్ఫూర్తిదాయకం

'పతంజలి రామ్‌దేవ్ విసిరిన రాకెట్టు!' కథనం వ్యాపారరంగంలో అడుగు పెట్టాలనుకున్న యువతకు స్ఫూర్తిదాయకంగా ఉంది. ఆయుర్వేద ఉత్పత్తులపై ప్రజల్లో అవగాహన కల్పించడంతోపాటు మనదేశ సంపద విదేశాలకు తరలివెళ్లకుండా చూడటం ఆహ్వానించదగ్గ పరిణామాలు.

*- ఎ.వి.జి.కృష్ణ, కాకినాడ*

*- దత్త ప్రసాద్ (ఈమెయిల్)*

### ప్రేమబంధం

'ప్రేమసూత్రం' కథ వివాహబంధంలోని మాధుర్యాన్ని తెలియజేసింది. భార్యాభర్తల మధ్య తలెత్తే కోపతాపాలను ప్రేమతో జయించాలనే విషయాన్ని మాల పాత్రద్వారా చెప్పిన తీరు బాగుంది.

*- లలితా శంకర్, మురళీ, నూజివీడు*

### జై.. గణేశా!

కాణిపాకం బ్రహ్మోత్సవాల సమయంలో వినాయకుడికి జరిగే పలుసేవల గురించి చక్కగా వివరించారు. రాజకీయ ప్రముఖులు విదేశీపర్యటనల్లో బాగంగా వచ్చిన కానుకలను భద్రపరిచే తోషాఖానా విశేషాలు ఆకట్టుకున్నాయి.

*- కె. శోభారాణి, మహబూబ్‌నగర్*

### కొత్త వింతలు

మధ్యపేజీల్లో ఇచ్చిన కొత్త వస్తువుల వివరాలు బాగున్నాయి. చీరమీదా జాకెట్టుమీదా బంగారు ఆభరణాల్ని పోలిన ఎంబ్రాయిడరీ డిజైన్లు ఆశ్చర్యంగా అనిపించాయి.

*- ఎస్.సునీత, విజయనగరం*

### అభినందనీయం

వైకల్యాలను అధిగమిస్తూనే తమ భావాలను లఘుచిత్రాలుగా మలుస్తున్న డెఫ్ రెయిన్‌బో ఫిల్మ్స్ బృందాన్ని అభినందించకుండా ఉండలేం. తనలా బధిరులైన వారందరినీ ఒక చోటకు చేర్చి వారిలోని సృజనకు పట్టం కడుతున్న సయ్యద్ నిజాం ఎంతోమందికి ఆదర్శం.

*- కె.బంగారురాజు, వరంగల్*

*- ఎం.భవాని, రాజమండ్రి*

### ఉపయుక్తం

ప్రజలు సంతోషంతో జీవనం సాగించేందుకు ప్రభుత్వాలే మంత్రిత్వశాఖలను ఏర్పాటు చేయడం ఉపయుక్తమైన విషయం. ఎంచుకున్న రంగంలో విజయాలందుకుంటున్న దర్శకుడు హనుమంతరావు రాఘవపూడి జీవితవిశేషాలు చదివించాయి.

*- ఎల్. శ్రీనివాస్, విశాఖపట్నం*

*- ఆర్. రుద్రవేణి (ఈమెయిల్)*

### మంచిమాట

స్నేహమనేది చెరకుగడలాంటిది. కొరికినా నరికినా నమిలినా తియ్యగానే ఉంటుంది తప్ప చేదుగా మారదు.





**బొజ్జగణపయ్యకు తొమ్మిది రోజులూ ధూపదీప నైవేద్యాలతో వైభవంగా పూజలు చేసి చివరి రోజున నిమజ్జన కార్యక్రమాన్ని నిర్వహించడం మనకు ఆనవాయితీ. కానీ ఒక ఊళ్లో మాత్రం వినాయకుడికి అలాగే పూజలు చేస్తారు కానీ, నిమజ్జనం చేయరు. చెక్కతో చేసిన ఈ గణపతి కేవలం నవరాత్రుల్లో మాత్రమే దర్శనమిస్తాడు. మహారాష్ట్రలోని పాలజ్‌లో కొలువైన ఈ స్వామిని చూసేందుకు ఈ తొమ్మిది రోజులూ లక్షల జనం బారులు తీరుతారు.**

# ఈ గణపతిని నిమజ్జనం చేయరు!

ఏడాదికోసారి గణపతి నవరాత్రులొస్తాయి. రకరకాల ఆకృతుల్లో బోలెడు రంగుల్లో గణేశ్ బొమ్మలు దొరుకుతాయి. ఇంటికో బుజ్జి గణపతి కొలువుతీరితే మండపాన్ని బట్టి ఆకాశమెత్తువీ కొలువుతీరతాయి. కానీ మహారాష్ట్రలోని పాలజ్ వాసులకు మాత్రం గణపతి నవరాత్రులంటే తమ ఊళ్లోని చెక్క వినాయకుడే గుర్తొస్తాడు. ఆయన్నే తమ కష్టాలను తీర్చేవాడిగా కొలుస్తారు. ఒకసారి గణపతి నవరాత్రులకు పెట్టిన బొమ్మనే అరవై ఏళ్లుగా వాళ్లు కొలుస్తున్నారు. ఎంతో భక్తితో ఆయనకు గుడికట్టి పూజలు చేస్తున్నారు. నవరాత్రుల్లో మాత్రమే ఆయన దర్శనం లభిస్తుండటంతో దేశం నలుమూలల నుంచీ భక్తులు ఆ గ్రామానికి బారులు తీరుతున్నారు. ఆయనే మహారాష్ట్ర రాష్ట్రం నాందేడ్ జిల్లా పాలజ్ గ్రామంలో కొలువైన సంకటహర గణపతి. తెలంగాణాలోని ఆదిలాబాద్ జిల్లాకు సరిహద్దులో ఉంటుందీ గ్రామం.

### మొదటి గణపతి...

మొదట్లో అన్ని గ్రామాల్లాగే పాలజ్‌లోనూ వినాయక నవరాత్రులు జరిపి స్వామిని నిమజ్జనం చేసేవారు. అయితే 1948 ప్రాంతంలో నాందేడ్ జిల్లాతో పాటు ఆ చుట్టు పక్కల ప్రాంతాల్లో విపరీతమైన కరవు వచ్చింది. దాంతోపాటూ పాలజ్‌లో కలరా వ్యాపించి విపరీతంగా జనం మరణించారు. అయితే నవరాత్రుల సందర్భంగా గణపతిని నిమజ్జనం చేయడమే ఇందుకు కారణమై ఉంటుందని గ్రామ ప్రజలు భావించారు. అందుకే అక్కడి ఒక స్వామీజీ సూచనల మేరకు కొయ్యబొమ్మలకు ప్రఖ్యాతి చెందిన నిర్మల్ పట్టణానికి వెళ్లి మంచి కలపతో నాలుగడుగుల ఎత్తున వినాయకుడి చెక్క విగ్రహాన్ని చేయించారు గ్రామస్థులు. దాన్ని తీసుకువచ్చి అర్చనలు చేశారు. విగ్రహాన్ని నిమజ్జనం చేయకుండా తమ ఊరిలోనే శాశ్వతంగా నిలుపుకోవాలన్నది వాళ్ల ఆలోచన. అందుకే ఆ స్వామికి గుడికట్టారు. ఆ విగ్రహాన్ని గ్రామంలోకి తెచ్చుకున్న తర్వాత ఆ ప్రాంతం వెనువెంటనే పాడిపంటలతో కళకళలాడిందట. కలరా మహమ్మారి కూడా ఊరి నుంచి దూరమైందట. కరవు సమయంలో గోదావరిలో నీళ్లు లేకపోవడంతో ఒక బురద గుంటలో గణపతిని నిమజ్జనం చేయాల్సి వచ్చిందనీ, అలాంటి పరిస్థితి మళ్లీ రాకుండా ఉండటానికే చెక్క గణపతిని నిలుపుకున్నారనీ మరో కథ ప్రచారంలో ఉంది.

### ఆ తొమ్మిది రోజులే...

పాలజ్‌లోని గణపతి దేవాలయంలోని చెక్క గణపతిని ఎప్పుడంటే అప్పుడు దర్శనం చేసుకోలేం. కేవలం గణపతి నవరాత్రుల సందర్భంగా మాత్రమే ఆ విగ్రహాన్ని బయటకు తీసి అర్చనలు జరుపుతారు పూజారులు. ఆ సమయంలో స్వామిని చూసేందుకు తెలుగురాష్ట్రాలతో పాటు కర్ణాటక, ఛత్తీస్‌ఘడ్, గుజరాత్, మధ్యప్రదేశ్ తదితర రాష్ట్రాల నుంచి లక్షల సంఖ్యలో భక్తులు తరలివస్తారు. కోరిన కోర్కెలు తీర్చే కొంగుబంగారంగా స్వామిని కొలుస్తారు. నవరాత్రుల సమయంలో స్వామితో పాటు మరో చిన్న మట్టి విగ్రహాన్ని ఉంచి పూజలు చేస్తారు. దాన్ని గోదావరిలో నిమజ్జనం చేసి ఆ నీళ్లను తెచ్చి స్వామి మీద చల్లుతారు. తర్వాత ఆ విగ్రహాన్ని తీసి ప్రత్యేకమైన గదిలో భద్రపరుస్తారు. విగ్రహాన్ని మళ్లీ బయటకు తీసేది గణేశ్ చతుర్థికే. మిగతా ఏడాదంతా స్వామి స్థానంలో ఆ విగ్రహపు ఫొటోను ఉంచి పూజలు నిర్వహిస్తారు. నవరాత్రుల సమయంలో ఊళ్లో ఎవరూ మాంసాహారాన్ని వండరు. దాదాపు 75 శాతం యువతీ యువకులంతా ఈ రోజుల్లో ఉపవాసాలు చేస్తారు.

### సౌకర్యాలు...

దట్టమైన అటవీప్రాంతంలో గోదావరి పాయల వెంట మనోహరంగా కొలువై ఉంది పాలజ్ దేవాలయం. స్వామి మహిమ ఊరూరా ప్రచారమవుతుండటంతో పాలజ్‌కి వచ్చే భక్తుల సంఖ్య ఏటికేటికీ పెరుగుతోంది. ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకుని ఇక్కడ మంచి నీటి ప్లాంటును ఏర్పాటు చేసి, పులిహోరను ఉచిత ప్రసాదంగా పంచుతోంది కమిటీ. ఆలయం దగ్గర పెద్ద భోజన హాళ్లున్నాయి. అలాగే భక్తులు సేద తీరేందుకు విశ్రాంతి మందిరాలూ అందుబాటులో ఉన్నాయి. పాలజ్ తెలంగాణ రాష్ట్రం నిర్మల్ జిల్లా భైంసాకు సుమారు పాతిక కిలోమీటర్ల దూరంలో ఉంటుంది. హైదరాబాద్, నిజామాబాద్, ఆదిలాబాద్‌ల నుంచి భైంసాకు బస్సులుంటాయి. అక్కడి నుంచి పాలజ్‌కు తరచుగా బస్సులు నడుస్తుంటాయి. పాలజ్ పేరుకి మహారాష్ట్ర రాష్ట్రంలో ఉన్నా ఆ గ్రామంలో తెలుగువారే ఎక్కువ. అందుకే స్వామిని దర్శించుకునేవారిలో మనవాళ్లే ఎక్కువగా కనిపిస్తారు.



# నాగవల్లివో... తమలపాకువో..!

**భో**జనం అరగడానికి మాత్రమే అనుకుని నమిలే తమలపాకును ఆయుర్వేదంలో ఎన్నో వ్యాధులకు ఔషధంలా వాడతారు ఆయుర్వేద వైద్యులు. దీన్నే నాగవల్లి అనీ పిలుస్తారు. ఇందులో విటమిన్-సి, థైమీన్, నియాసిన్, రిబోఫ్లేవిన్, కెరోటిన్... వంటి విటమిన్లతోబాటు కాల్షియం కూడా సమృద్ధిగా లభ్యమవుతుంది.



★ ఇది జీవక్రియావేగాన్ని పెంచడంతోపాటు కొవ్వుని తగ్గిస్తుంది. మధుమేహం, ఊబకాయం తగ్గడానికి ఎంతో దోహదపడుతుంది. నోటి క్యాన్సర్లనీ అడ్డుకుంటుంది.

★ ఈ ఆకుని నోట్లో పెట్టుకోగానే మండినట్లుగా అనిపించడానికి కారణం అందులోని చవికాల్ అనే ఫినాలిక్ పదార్థమే. ఇది యాంటీసెప్టిక్‌గా పనిచేసి పుండ్లను నివారిస్తుంది. అందుకే దీన్ని గాయాలూ, కాలిన పుండ్లమీద పెట్టి కట్టుకడితే త్వరగా తగ్గుముఖం పడతాయి.

★ తీవ్రమైన తలనొప్పితో బాధపడేవాళ్లు ఈ ఆకులు నమిలితే ఫలితం ఉంటుంది. లేదా దీని రసాన్ని నుదుట పట్టించినా నొప్పి తగ్గుతుంది.

★ బాగా అలసటగా అనిపించినప్పుడు తమలపాకురసంలో టీస్పూను తేనె వేసి రోజుకి రెండుసార్లు తీసుకుంటే మంచి టానిక్‌లా పనిచేస్తుంది.

★ తరచూ జలుబుదగ్గులతో బాధపడే పిల్లలకి గోరువెచ్చని ఆవనూనెలో తమలపాకుల్ని నానబెట్టి ఛాతీమీద పెడితే వెంటనే తగ్గుముఖం పడుతుంది.

★ కాల్షియం లోపంతో బాధపడేవాళ్లు రోజుకి రెండు ఆకుల చొప్పున వరసగా మూడునెలలు తింటే ఫలితం కనిపిస్తుంది. రెండుటేబుల్‌స్పూన్ల కొబ్బరినూనెలో టీస్పూను తమలపాకు రసం కలిపి ఒంటికి పట్టించి పావుగంట తరవాత వేడినీళ్లతో స్నానం చేస్తే చర్మ సంబంధిత అలర్జీలు తగ్గుతాయి. ఆర్థ్రయిటిస్, కీళ్లనొప్పులతో బాటు గాయాలూ పుండ్లతో బాధపడేవాళ్లు తమలపాకు రసాన్ని ఆయా భాగాల్లో రాసి, దానిమీద తమలపాకుని అంటించి కట్టుకడితే తగ్గుముఖం పడతాయి.




## ఉదయంపూటే విందుభోజనం!

**ఉ**దయంపూట తీసుకునే అల్పాహారాన్ని విందు భోజనం మాదిరిగానూ మధ్యాహ్న భోజనాన్ని మితంగానూ రాత్రికి మరీ తక్కువగానూ తీసుకోమని ఈమధ్య పోషక నిపుణులు తరచూ చెబుతున్నారు. కానీ చాలామంది దీనికి పూర్తి రివర్సులో తింటుంటారు. అయితే అది ఎంత మాత్రం మంచిది కాదంటున్నారు కాలిఫోర్నియా విశ్వవిద్యాలయ పరిశోధకులు. ఎందుకంటే జీర్ణక్రియతోబాటు పిండిపదార్థాలను నిల్వ చేయడంలో కీలకపాత్ర వహించే ఇన్సులిన్ హార్మోన్ పనితీరు కూడా ఉదయం వేళలోనే క్రియాశీలకంగా ఉంటుందట. అందుకే ఉదయం వేళలో తీసుకున్న పోషకాలన్నీ శక్తిగా మారి, శరీరభాగాల పనితీరుకి దోహదపడతాయి. అదే రాత్రివేళలో తిన్నాక ఓ గంట అటూఇటూగా వెంటనే నిద్రపోతాం. ఆ సమయంలో క్లోమ గ్రంథి ఇన్సులిన్‌ను స్రవించదు. ఫలితంగా మధుమేహం, ఊబకాయం రావడానికి అవకాశం ఎక్కువ. ఈ విషయాన్ని నిర్ధరించుకోవడానికి ప్రయోగపూర్వకంగా కొంతమంది ఊబకాయుల్ని తీసుకుని రెండు వర్గాలుగా విభజించి ఉదయం వేళలో 700, మధ్యాహ్నం 500, సాయంత్రం 200 క్యాలరీల చొప్పునా, మరో వర్గానికి దీనికి రివర్సులోనూ పన్నెండు వారాలపాటు ఆహారాన్ని ఇచ్చి చూడగా, మొదటి విభాగంలోని వారు ఊహించని విధంగా బరువు తగ్గినట్లూ రెండో వర్గం మరింత పెరిగినట్లూ గుర్తించారు. కాబట్టి ఎప్పుడు ఎంత తినాలో తెలుసుకుని తినండి మరి.



## కంటిపరీక్షతో ఆల్జీమర్స్!

**ఆ**ల్జీమర్స్... దీన్ని గుర్తించేందుకు ఇంతవరకూ సరైన పరీక్షలు రాలేదనే చెప్పాలి. అందుకే లాస్‌ఏంజెలిస్‌లోని మ్యాక్సీన్ డునిట్జ్ న్యూరోసర్జికల్ ఇన్‌స్టిట్యూట్‌కి చెందిన పరిశోధకులు సరికొత్త విధానాన్ని గుర్తించారు. వృద్ధాప్యంలో అందరూ తరచూ కంటిపరీక్షలు చేయించుకుంటూనే ఉంటారు. ఆ పరీక్షల ద్వారానే ఆల్జీమర్స్‌నీ గుర్తించవచ్చు అంటున్నారు. మెదడు కణాలు చనిపోవడంవల్లే ఆల్జీమర్స్ వస్తుంది. దీనికి కారణం బీటా-అమిలాయిడ్ అనే ప్రొటీన్ ఆయా కణాలమీద పేరుకోవడమే. రక్తనాళాల్లో పేరుకునే కొవ్వు కణాల మాదిరిగానే మెదడు కణాల చుట్టూ ఈ ప్రొటీన్ అతుక్కుని వాటిని క్రియారహితంగా చేస్తుంది. అయితే ఆ ప్రొటీన్ జాడల్ని గుర్తించాలంటే రకరకాల స్కానింగులు అవసరం. వాటితో సంబంధం లేకుండా ఇటీవల చేసిన ఓ పరిశోధనలో రెటీనా నుంచి మెదడుకు సంకేతాలు చేరకుండా ఈ ప్రొటీన్ అడ్డుకుంటున్నట్లు గుర్తించారు. దాంతో ఆల్జీమర్స్ రోగుల్లో రెటీనాను పరిశీలించగా- ఆ రెటీనా వెనక భాగంలో ఆ ప్రొటీన్ ఉన్నట్లు తేలింది. కాబట్టి ముందు రెటీనా పరీక్షతోనే ఆల్జీమర్స్‌ను గుర్తించవచ్చు అంటున్నారు నిపుణులు.

## చేతులు కడుగుతున్నారా?

'అబ్సెసివ్ కంపల్సివ్ డిజార్డర్' గురించి తెలిసిందే. పదే పదే సబ్బుతో చేతులు కడగడం, చేసిన పనే చేయడం, తుడిచిందే తుడవడం... వంటి అతి శుభ్రతతోబాటు తాళం వేశామా లేదా అన్న అనుమానం వెంటాడటం... వంటివన్నీ ఆ వ్యాధి లక్షణాలే. నిజానికి ఇది చిన్న మానసిక సమస్య. కానీ కొన్ని సందర్భాల్లో చాలా ఇబ్బందుల్ని తెచ్చిపెడుతుంది. అందుకే దాని నివారణకోసం చేస్తున్న పరిశోధనల్లో భాగంగా యూనివర్సిటీ ఆఫ్ కేంబ్రిడ్జ్‌కు చెందిన నిపుణులు కొత్త చికిత్సా విధానాన్ని కనుగొన్నారు. అందులో భాగంగా ఆ వ్యాధి బాధితులైన పది మందిని ఎంపికచేసి, వాళ్ల ముందు కావాలనే మురికి వస్తువులను పట్టుకున్నట్లుగా చేసి, ఆ తరవాత చేతుల్ని పదే పదే కడగసాగారట. అది చూసీ చూసీ ఆ వ్యాధి బాధితులకు అదెంత చికాకు పనో అర్థమై, తాములా ప్రవర్తించడాన్ని తగ్గించుకున్నారట. అంటే తమలాంటి వాళ్లని దగ్గరగా పరిశీలించినప్పుడు- బాధితులు తాములా చేయడాన్ని తగ్గించుకుంటారన్నది సదరు శాస్త్ర నిపుణుల విశ్లేషణ.



## టూకీగా...

**చు**ట్టూ స్నేహితులు ఉన్నా మనసులో ఎక్కడో గుబులుగా ఒంటరిగా ఫీలయ్యేవాళ్లలో మానసిక సమస్యలే కాదు, శారీరక వ్యాధులూ వచ్చే అవకాశం ఉందని యూనివర్సిటీ ఆఫ్ కాలిఫోర్నియా పరిశోధకులు అంటున్నారు.

★ బీపీ, షుగర్, కొలెస్ట్రాల్ లేకుండా ఆరోగ్యంగా ఉన్నప్పటికీ ఊబకాయులకి హృద్రోగ ముప్పు పొంచే ఉంటుందని లండన్ ఇంపీరియల్ కాలేజ్ నిపుణుల ఉవాచ.

# మా మంచి మాస్టారు!

గురువూ దైవం... ఇద్దరూ ఒకేసారి నా ఎదుట ప్రత్యక్షమైతే దైవం గురించి తెలిపే గురువుకే ముందుగా నమస్కరిస్తానన్నాడు కబీర్ దాస్. అమ్మానాన్నలు ప్రాణం పోస్తే... ఆ ప్రాణికి జీవన విలువలు నేర్పి వ్యక్తిగా మలిచేది గురువే. ఉద్యోగాన్ని ఉపాధిగా కాక గురుతరమైన బాధ్యతగా భావించి అంకితమయ్యే ఉపాధ్యాయులకూ... సొంత సమయాన్నీ సంపాదననీ కేటాయించి విద్యార్థుల సంక్షేమానికై తపించే సేవామూర్తులకూ... అసలు బోధన తమ వృత్తి కాకపోయినా, చదువుకునే పరిస్థితులు లేని పిల్లలకోసం ఉపాధ్యాయుల అవతారం ఎత్తి విద్యాదానం చేస్తున్నవారికీ... ఉపాధ్యాయ దినోత్సవ శుభాకాంక్షలు చెబుతూ...



మైక్రోసాఫ్ట్ లేని ప్రపంచాన్ని ఊహించగలమా ఇప్పుడు? బిల్ గేట్స్ మాత్రం 'వాళ్లే లేకపోతే నేనూ లేను... మైక్రోసాఫ్టూ లేదు' అంటారు. ఆయన ఇప్పటికీ తలచుకునేది తన చిన్ననాటి లెక్కల టీచర్నీ, డ్రామా టీచర్నీ. ఒకరు అంకెలను ప్రేమించేలా చేస్తే మరొకరు జీవితం పట్ల తన దృక్పథాన్ని మార్చారంటారాయన.

బిల్ గేట్స్‌కే కాదు... స్ఫూర్తినిచ్చి మార్గనిర్దేశం చేసిన మంచి మాస్టార్లు ప్రతి వ్యక్తి జీవితంలోనూ తప్పనిసరిగా ఉంటారు. అది బడిలో పాఠాలు చెప్పిన టీచరు కావచ్చు! ఇంట్లో ట్యూషన్ చెప్పిన మాస్టారు కావచ్చు! సేవాభావనతో చేయందించిన గురువు కావచ్చు...

అందరి లక్ష్యం ఒకటే, పిల్లలందరూ చక్కగా చదువుకుని గొప్పగా ఎదగాలన్నదే. అలాంటి కొందరు మంచి మాస్టార్ల గురించి...

## ఒక్కడే... బడిని నిలబెట్టాడు!

తెల్లని చొక్కా, నెరిసిన తల, చెరగని చిరునవ్వు... ఊరివాళ్లకు ఆయన సుపరిచితులు. పిల్లలన్నా బడి అన్నా ఆయనకు ప్రాణం అని మాత్రమే వారికి తెలుసు. అయితే మూతబడిపోతున్న ఒక పాఠశాలను నిలబెట్టడానికి ఆయన ఏం చేశాడో, అందుకు ఎన్ని కష్టాలు పడ్డాడో తెలియదు. ఎలాగైతేనేం... ఆయన మాత్రం అనుకున్నది సాధించారు. మూసేసిన బడి తలుపులు తెరుచుకునేలా చేశారు. అందుకు ముంజ వెంకట్రాజం ఏం చేశారంటే...

వరంగల్ స్టేషన్‌రోడ్డులో ఉంటుంది సుశీలాదేవి ప్రభుత్వ ఉన్నత పాఠశాల. 1958లో ఆకారపు రాజ చెన్న విశ్వేశ్వర్‌రావు స్థాపించిన ఈ (ఎయిడెడ్) పాఠశాలలో సీటు దొరకాలంటే ఒకప్పుడు పెద్దల సిఫార్సు కావాల్సి వచ్చేది. 20 మందికి పైగా ఉపాధ్యాయులూ, వందలాది విద్యార్థులతో కళకళలాడిన బడి ప్రైవేటు, కార్పొరేట్ పాఠశాలల ధాటికి క్రమంగా వైభవాన్ని కోల్పోయింది. విద్యార్థులు తగ్గిపోవడంతో అధికారులు రెండేళ్ల క్రితం పాఠశాలను మూసేసి అందులో మిగిలి ఉన్న ఒకరిద్దరు విద్యార్థులను మరో పాఠశాలలో చేర్పించారు. ఉపాధ్యాయులను బదిలీచేశారు. కానీ వెంకట్రాజానికి ఆ పాఠశాల వదిలి వెళ్లడానికి మనసు రాలేదు. తానే పాఠశాలను నడిపిస్తానని అధికారులను బతిమాలుకున్నారు. వారు సరేననడంతో వెంటనే రంగంలోకి దిగి స్థానిక అండర్‌బ్రిడ్జి దగ్గరున్న పేదల గుడిసెలకు వెళ్లారు వెంకట్రాజం. పిల్లలను పాఠశాలకు పంపించేలా తల్లిదండ్రులను ఒప్పించారు. అలా, మూసిన బడిని మరుసటి నెలలోనే నలుగురు పిల్లలతో తెరిచారు. కొన్నాళ్లు రోజూ తానే ఇల్లిల్లూ తిరిగి పిల్లల్ని చేయిపట్టుకుని తీసుకొచ్చేవారు. తర్వాత సొంత ఖర్చుతో ఆటో మాట్లాడి పిల్లలను తీసుకొచ్చేవారు. క్రమంగా పిల్లల సంఖ్య పెరిగింది. బడిలో పాఠాలు చెప్పడానికి సొంత డబ్బు నుంచి జీతం ఇచ్చి ఇద్దరు టీచర్లను నియమించారు. పిల్లలకు మధ్యాహ్న భోజనమూ పెడుతున్నారు. అలా మూతపడిందనుకున్న పాఠశాలను తిరిగి నిలబెట్టి యాజమాన్యంతో పాటు అధికారుల మన్ననలనూ అందుకున్నారు వెంకట్రాజం.



- న్యూస్‌టుడే, శివనగర్

## ట్యూబు మాస్టారు

మాస్టారు వస్తున్నాడంటే పిల్లలంతా గప్‌చుప్‌గా తరగతి గదికి పరుగులు తీస్తారు. కానీ ఈ మాస్టారికి మాత్రం స్వాగతం చెప్పడానికి వారంతా రోజూ నది ఒడ్డున వేచి చూస్తారు. సాయంత్రం మళ్లీ సాగనంపుతారు కూడా. ఎందుకలా?

ఓ ప్లాస్టిక్ బ్యాగు, చెప్పులు చేతో పట్టుకుని నదిలో ఈదుకుంటూ బడికి వెళ్తాడు అబ్దుల్ మలిక్. అతడు కేరళలోని మలప్పురం ప్రాథమిక పాఠశాలలో గణిత ఉపాధ్యాయుడు. మలప్పురం చుట్టూ నది ప్రవహిస్తుంటుంది. రోడ్డుమార్గంలో ఆ ఊరు వెళ్లిరావడానికి 4 గంటలు పడుతుంది. దానికన్నా నది ఈదడం తేలికనుకున్నాడు అబ్దుల్. కిలోమీటరు వెడల్పున్న నదిని పావుగంటలో ఈది బడికి చేరుకుంటాడు. రెండు దశాబ్దాలుగా అబ్దుల్ దినచర్య అదే. నడుముకి ఒక రబ్బరు ట్యూబు తగిలించుకుని ఈదుకుంటూ వచ్చే ఆయన్ని పిల్లలు ట్యూబు మాస్టారు అని పిలుచుకుంటారు. ఇంతకష్టపడి అబ్దుల్ ఆ ఉద్యోగమే చేయడానికి కారణం... అబ్దుల్‌కి చిన్న పిల్లలన్నా, వారికి పాఠాలు చెప్పడమన్నా చాలా ఇష్టం. పదో తరగతి పాసైనప్పటినుంచే టీచరు ఉద్యోగానికి శిక్షణ పొందడం ప్రారంభించాడు. సోదరులు గల్ఫ్ వెళ్లి సంపాదిస్తూ అబ్దుల్‌ని పైచదువులు చదువుకోమన్నా వినకుండా తనకిష్టమైన టీచరు ఉద్యోగం సంపాదించాడు. ఒక్కరోజు కూడా సెలవు పెట్టకుండా సమయానికి బడికి వచ్చే అబ్దుల్‌ని చూసి ఊరివాళ్లు సమయం నిర్ధారించుకుంటారట. అబ్దుల్ నది ఈది బడికి వెళ్తున్న విషయం వార్తాపత్రికల్లో చూసిన ఓ ప్రవాసభారతీయుడు అతనికి ఒక పడవ కొనిచ్చాడు. ఆటుపోట్లు ఎక్కువగా ఉండే నదిలో పడవప్రయాణం ప్రమాదకరమంటాడు అబ్దుల్. ఒంట్లో బాగున్నాన్నాళ్లూ తన బడినీ పిల్లలనూ వదలననే అబ్దుల్ పిల్లలకి నీరంటే భయం పోగొట్టి ఈత నేర్పుతుంటాడు కూడా. ప్రకృతితో మమేకమై జీవించడం పిల్లలకు నేర్పాలనే ఈ ఉపాధ్యాయుడు ఏం చెప్పినా ఆ ఊరివారికి వేదవాక్కే. తమ వ్యక్తిగత విషయాలైనా, ఊరి విషయమైనా అతని సలహా తీసుకోకుండా ఏ పనీ చేయరు.

# ఆమెకు ఆరువందల మంది పిల్లలు

ఆ ప్రధానోపాధ్యాయురాల్ని చూసి పిల్లలు భయపడరు. కష్ట సుఖాలు చెప్పుకుంటారు. ఇష్టంగా చదువుకుంటారు. వారి తల్లి దండ్రులూ అంతే. పిల్లల్ని ఆమెకు అప్పగించి నిశ్చింతగా ఉంటారు. ఆరువందలమందికి పైగా ఉన్న గిరిజన సంక్షేమశాఖ బాలికల ఆశ్రమ పాఠశాలకి ప్రధానోపాధ్యాయురాలైన అంపిలి లిల్లీరాణి పిల్లల్ని కంటికి రెప్పలా చూసుకుంటారు. ఆదివారాలూ సెలవులూ పండగలూ అన్నీ వారితోనే. పొద్దున్నే 8గంటల కల్లా బయల్దేరి బడికి వస్తే తిరిగి రాత్రి తొమ్మిదింటికే ఇంటికి వెళ్లడం. అమ్మానాన్నల్ని టీచర్లుగా చూసిన లిల్లీరాణి ఎంతో ఇష్టంగా సైన్సు టీచరయ్యారు. నిత్యజీవితంలో సైన్సు ఉపయోగాలనే పాఠాలుగా చెప్తూ పిల్లలకు చేరువయ్యారు. మన్యంలో డిజిటల్ బోధనకు శ్రీకారం చుట్టిన తొలి టీచర్ ఆమే. ఇపుడు శ్రీకాకుళం జిల్లా సీతంపేటలోని హడ్డుబంగిలో ఆమె పాఠశాలకు అంకిత మైన తీరు తల్లిదండ్రుల మనసు దోచుకోవడంతోపాటు అధికా రుల ప్రశంసలనూ అందుకుంది. పాలనా వ్యవహారాలు చూసు కుంటూనే రోజూ కొన్నిగంటలు తప్పనిసరిగా పిల్లలతో గడుపు తారామె. సన్నిహితంగా ఉండి వారి సామర్థ్యాలు తెలుసుకుని తదనుగుణంగా ప్రోత్సహిస్తారు. నాయకత్వ లక్షణాలు పెంపొం దించడానికి పిల్లలతో చిన్న చిన్న కమిటీలు వేసి బాధ్యతలు అప్పజెప్పారు. హెల్త్ కమిటీ పిల్లలకు తెల్లకోట్లు కొనిచ్చారు. వాళ్లు అవి ధరించి డాక్టరవ్వాలన్న స్ఫూర్తి పొందుతోంటే, వారిలో ఒక్కరు డాక్టరైనా తన ప్రయత్నం ఫలించినట్లేనంటారు లిల్లీరాణి. పిల్లలకు క్రమం తప్పకుండా వైద్యపరీక్షలు చేయిస్తారు. పాఠశాల, వసతిగృహాలను సకల వసతులతో తీర్చిదిద్దడమే కాక, 8 ఎకరాల ప్రాంగణాన్ని చక్కని తోటగా అభివృద్ధి చేశారు. అందులో పండించే కూరగాయలనే వసతిగృహంలో వినియోగి స్తారు. తద్వారా వచ్చిన ఆదాయంతో పిల్లలకు కావలసినవి కొంటారు. గిరిజనులు సంగీత ప్రియులని వారికి పాటల సీడీలు కొనిపెట్టారు. కుట్టు మిషన్లు కొని ఆసక్తి ఉన్న పిల్లలకు నేర్పిస్తు న్నారు. పిల్లలకు ఇంటిపై ధ్యాస మళ్లి, చదువు మానేయకూడ దన్న లక్ష్యంతో వారిని సంతోషంగా ఉంచడం కోసం ఆమె పలు సాంస్కృతిక కార్యక్రమాలు చేపడుతున్నారు. నిధులు చాలక పోతే సొంత డబ్బే ఖర్చుపెడతారు. పిల్లలు సాధించిన ప్రతి విజ యాన్నీ ప్రశంసిస్తూ మిఠాయిలు పంచుతారు. గిరిజన ప్రాంతాల్లో ఎక్కువగా వ్యాపించే వ్యాధుల గురించి విద్యార్థులకే కాక గ్రామాల్లోనూ అవగాహన కల్పిస్తారు. విద్యార్థుల తల్లిదం డ్రులతో ఆమె తరచూ సమావేశమవుతారు.

- న్యూస్‌టుడే, సీతంపేట




# వంతెన కింద... ఓ విద్యాలయం!

ఆయన వృత్తి రీత్యా టీచరు కాదు, వ్యాపారస్తుడు. ఉపాధ్యాయ వృత్తితో ఏమాత్రం సంబంధం లేని రాజేశ్ కుమార్ శర్మ దిల్లీలోని మెట్రో వంతెన కింద ఓ పాఠశాల తెరిచారు. దాదాపు 300 మంది పిల్లలు అక్కడ అక్షరాలు దిద్దుతుంటారు. ఆర్థిక పరిస్థితుల వల్ల ఇంజినీ రింగ్ సగంలో వదిలేసిన రాజేశ్‌కి చదువు విలువ బాగా తెలుసు. మురి కివాడల్లో పిల్లలు చదువూ సంధ్యా లేకుండా తిరగడం ఆయనకు బాధ కలిగించింది. 2006లో ఆ పిల్లలందరినీ సమీకరించి అక్షరాలు దిద్దిం చడం ప్రారంభించారు. తన పలుకుబడిని ఉపయోగించి పిల్లలకు అవ సరమైన సామగ్రిని విరాళాల రూపంలో సేకరిస్తారు. పిల్లలందరినీ దగ్గ ర్లోని ప్రభుత్వ పాఠశాలలో చేర్పిస్తారు. స్కూల్లో వారు నేర్చుకున్నదానికి రాజేశ్ తన పాఠాలతో మెరుగుపెడతారు. పొద్దున్నా సాయంత్రమూ రెండేసి గంటల చొప్పున ఆయన ఆంగ్లం, గణితం, సైన్సు లాంటి సబ్జె



క్టుల్లో పాఠాలు చెప్తారు. పిల్లలే ఆ ప్రాంతమంతా శుభ్రంచేసుకుని చాపల మీద కూర్చుని చదువుకుంటారు. వంతెన గోడలనే బ్లాక్‌బోర్డు లుగా మార్చారు రాజేశ్. తల్లిదండ్రులు పనులకు వెళ్లిపోవడంతో ఆలనా పాలనా లేక ఒకప్పుడు పాఠశాల మొహమే చూడని ఆ పిల్లలంతా ఇప్పుడు చక్కగా చదువుకుంటున్నారు. రాజేశ్ నిస్వార్థ సేవ చూసి స్ఫూర్తిపొందిన కొందరు యువకులు కూడా వచ్చి ఇక్కడ పాఠాలు చెప్తుంటారు. ఈ వంతెనకింద పాఠశాలకి ఇప్పుడు దిల్లీలో ఎంత పేరొ చ్చిందంటే చుట్టుపక్కల ఐదారు కిలోమీటర్ల దూరంలో ఉన్న పేద కుటుంబాలవారు కూడా తమ పిల్లల్ని సైకిల్‌పైన తీసుకొచ్చి రాజేశ్ దగ్గర దించి పనులకు వెళ్తున్నారు. ఫీజులు కట్టి పిల్లల్ని ప్రైవేటు పాఠశా లలకూ ట్యూషన్లకూ పంపలేని నిరుపేదలకు రాజేశ్ నడుపుతున్న వంతెన కింద బడి ఓ వరం.



## సైన్స్ పాఠం అరవింద్ టాయ్స్‌తో



భర్త లేకపోయినా నలుగురు కొడుకుల్నీ కష్టపడి చదివించింది ఆ తల్లి. ఐఐటీలో ఎలక్ట్రికల్ ఇంజినీరింగ్ చదివి టెల్కోలో ఉద్యోగం వస్తే ఎగిరిగంతేయకపోగా ఆ ఉద్యోగం మానేసి తనకు నచ్చిన పని చేస్తానన్నారు అరవింద్ గుప్తా. నిరక్షరాస్యురాలైనా తల్లికి అతడి మనసు అర్థమైంది. సరేనంది. సోదరులంతా పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తుంటే అరవింద్ మాత్రం మూడు దశాబ్దాలుగా సైన్సు పాఠాలు చెప్తున్నారు. ఒకసారి ఆయన పాఠం విన్న పిల్లలెవరూ మళ్లీ మళ్లీ కావాలని అడగకుండా ఉండరు. ఎందుకంటే పనికిరాని వస్తువులతో పనికొచ్చే ప్రయోగాలను క్షణాల్లో చేసేసి ఆయన పిల్లల్ని అబ్బురపరుస్తుంటారు. పరిమిత వనరులతో అపరిమిత ఫలితం పొందవచ్చన్న విషయం పిల్లలకు నేర్పడానికి తానీ మార్గాన్ని ఎంచుకున్నానంటారు అరవింద్.

విజ్ఞానశాస్త్రాన్ని అర్థం చేసుకోవాలన్నా, అందులో పై చదువులు చదవాలన్నా ఆంగ్ల మాధ్యమంలో చదివే ఉన్నత వర్గాలవారికే సాధ్యమవుతుందన్న అపోహను అరవింద్ కొట్టిపడేస్తారు. అరవింద్‌గుప్తా టాయ్స్.కామ్ పేరుతో సొంత వెబ్‌సైట్ ప్రారంభించిన ఆయన పలు ప్రాంతీయ భాషల్లో సైన్సు ప్రయోగాలను వీడియోలుగా రూపొందించి అందులో పెట్టారు. వందలాది సైన్సు పుస్తకాలను ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకునేందుకు వీలుగా ఉంచారు. 12 భాషల్లో సైన్సు ప్రయోగాల వీడియోలు, ఫొటోలు ఈ వెబ్‌సైట్‌లో ఉన్నాయి. తాను వెళ్లిన ప్రతి చోటా ఈ-బుక్స్ ఉన్న సీడీలను పిల్లలకు పంచుతారు. 'ప్రతి విద్యార్థి కళ్లలో ఓ కలను చూస్తాను. ఆ కల నాకు భవిష్యత్తు పట్ల ఆశ కలిగిస్తుంది. అందుకే ఈ పని నాకు అంత ఇష్టం...' అనే అరవింద్ గాంధీ సిద్ధాంతాలను మనసా వాచా ఆచరిస్తారు. అరవింద్ కృషిని యునెస్కో, యునిసెఫ్, ఇంటర్నేషనల్ టాయ్ రీసెర్చ్ అసోసియేషన్, బోస్టన్ సైన్స్ సెంటర్, వాల్ట్ డిస్నీ ఇమేజినీరింగ్ అండ్ రీసెర్చ్... లాంటి సంస్థలు గుర్తించి గౌరవించాయి.

## విమలా టీచర్... వయసు 80 ప్లస్

ఎనిమిది పదుల వయసులో ఎవరైనా ఏం చేస్తారు? వచ్చే పింఛనుతో కాలక్షేపం చేస్తూ మనిమనవలతో ఆడుకుంటారు. కానీ విమలా కౌల్ అలా చేయడంలేదు. రాజధాని నగర బస్తీలో ఆమె ఓ పాఠశాల నిర్వహిస్తోంది. దాని పేరు 'గుల్‌దస్తా'. అంటే పుష్పగుచ్ఛం అని అర్థం. పిల్లల కోసం ప్రభుత్వ పాఠశాలలుండగా ఈ వయసులో ఎందుకంత శ్రమ తీసుకుంటున్నారని అందరూ ఆమెను అడుగుతుంటారు. ఉన్నత విద్యావంతులైన విమల, ఆమె భర్త ఎంతో ఇష్టంతో బోధనా వృత్తిని ఎంచుకుని కళాశాలల్లో అధ్యాపకుల్లా పనిచేశారు. అది 1995 నాటి సంగతి. రిటైరైన ఆ జంట ఏం చేయాలా అని ఆలోచిస్తూ దగ్గర్లోని ఓ గ్రామానికి వెళ్లారు. అక్కడి సమస్యల గురించి పెద్దలతో చర్చిస్తుండగా అల్లరి చేస్తున్న పిల్లలకు విమల బిస్కట్లు పంచారు. అది చూసిన ఓ మహిళ 'పిల్లలకు బిస్కట్లు పెడితే సరిపోదు, వాటిని సంపాదించడమెలాగో వారికి నేర్పాలమ్మా...' అని చెప్పిందట. ఆ మాట విమలని ఆలోచింపచేసింది. ఫలితంగా వెలసిందే 'గుల్‌దస్తా'. అయితే అదేమంత తేలిగ్గా జరగలేదు. తాము నివసిస్తున్న చోట స్కూలు పెట్టడానికి ఇరుగుపొరుగు అంగీకరించకపోవడంతో మున్సిపల్ పార్కులో నిర్వహించారు కొన్నాళ్లు. ఆ తర్వాత పిల్లలు ఉండే బస్తీలోనే నాలుగు గదుల్లోకి పాఠశాలను మార్చారు. భర్త మరణించినా విమల మాత్రం బోధన కొనసాగిస్తున్నారు. పాఠశాల నిర్వహణ కోసం ప్రత్యేకంగా ఓ ఎన్జీవోను ప్రారంభించారామె. 'ప్రభుత్వ పాఠశాలల్లో పిల్లలపట్ల ప్రత్యేక శ్రద్ధ చూపరు. వారి సామర్థ్యంతో సంబంధం లేకుండా పై తరగతికి పంపిస్తారు. ఫలితంగా పిల్లలు పదోతరగతికి వచ్చేస్తారు కానీ వారికి కనీస స్థాయి లెక్కలు, ఆంగ్లం రావు...' అంటారు విమల. అందుకే ఆమె కొందరు వలంటీర్ల సహాయంతో ఇక్కడ పిల్లలకు ఆంగ్లం, గణితం, సైన్సు పాఠాలు బోధిస్తున్నారు. తన దగ్గర చదువుకున్న పిల్లలు పెద్దవాళ్లై ఉద్యోగాల్లో చేరుతుంటే చూసి మురిసిపోతున్నారు ఈ టీచరు.



## పాఠాల ఫార్మాట్ మార్చేశాడు!

కమలేశ్ జపాడియా ఉండేదీ పనిచేసేదీ ఓ మారుమూల పల్లెటూళ్లో. ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడి ఉద్యోగం. పాఠశాల సంగతి పక్కన పెడితే ఇంట్లోనూ కరెంటు సరఫరా అంతంతమాత్రమే. పరిస్థితులు సహకరించడం లేదని అతను ఊరుకుండిపోలేదు. బడి అయిపోయాక రోజూ 20కి.మీ. దూరంలో ఉన్న పట్టణానికి వెళ్లివచ్చేవాడు. ఎందుకో తెలుసా? అక్కడ సైబర్ కేఫ్‌లో పనిచేసుకోవడానికి. అక్కడ అతనేం చేశాడంటే...

పల్లెల్లో పిల్లలను బడికి వచ్చేలా చేయడం ఒకెత్తు అయితే వారు మధ్యలో బడి మానకుండా చూసుకోవడం మరో ఎత్తు. అందుకు ఉపాధ్యాయులు చాలా కష్టపడాలి. పిల్లల్ని ఆకట్టుకునేలా పాఠాలు చెప్పడం ఉపాధ్యాయులకు సవాలే. టీవీలో 'కౌన్‌బనేగా కరోడ్ పతి' కార్యక్రమాన్ని ఆసక్తిగా చూస్తున్న పిల్లల్ని చూస్తే కమలేశ్‌కి ఓ ఆలోచన వచ్చింది. పాఠాలంటే విసుక్కునే పిల్లలు అవే విషయాలను టీవీలో చెప్తే ఆసక్తిగా వింటున్నారు. దాంతో పాఠాలన్నింటినీ అతడు క్విజ్ తరహా ఫార్మాట్‌లోకి మార్చేశాడు. పాఠ్యాంశాలేవీ పొల్లు పోకుండా ప్రశ్న- జవాబుల రూపంలోకి తెచ్చేశాడు. 'ఎడ్యుసఫర్.కామ్' పేరుతో ఓ వెబ్‌సైట్‌ని రూపొందించి వాటిని అందులో పొందుపరిచాడు. ఆన్‌లైన్‌లో క్విజ్ అంటే పిల్లలకు సరదా. ఆ సరదాతోనే ఉత్సాహంగా బడికొచ్చి పాఠాలూ నేర్చేసుకుంటున్నారు. కంప్యూటర్‌లో పాఠాలు పరీక్షల్లోనూ మంచి ఫలితాలే తెస్తున్నాయి. కమలేశ్ ప్రయత్నాన్ని అహ్మదాబాద్ ఐఐఎం సృజనాత్మకయత్నంగా గుర్తించి ప్రశంసించింది. గుజరాత్ రాష్ట్ర ప్రభుత్వం సైతం అతడిని సన్మానించింది. ఈ పాఠ్యాంశాలను సీడీల్లోకి డౌన్‌లోడ్ చేసి జిల్లాలోని అన్ని పాఠశాలలకూ ఇస్తోంది జిల్లా విద్యాశాఖ. ఇదంతా కమలేశ్ సొంత ఖర్చుతో, అదనపు గంటలు పని చేసి సాధించాడు. ఒక ప్రైమరీ స్కూల్ టీచర్‌నుంచి ఎవరైనా ఇలాంటి పని ఆశించగలరా?!



## పిల్లల దగ్గరికే బడి!

దూరంగా విసిరేసినట్లున్న పల్లెలు. ఎక్కడో పది కిలోమీటర్ల అవతల బడి. పెద్దలు పనులకు వెళ్లిపోతే పిల్లలు బడికెలా వెళ్తారు? ఈ ఆలోచన ఆదిత్యకుమార్‌ని 'సైకిల్ గురూజీ'ని చేసింది. యూపీలోని లఖ్‌నవూకి చెందిన ఆదిత్య పాఠాలు చెప్పడానికి అవసరమైన సరంజామా అంతా సైకిల్‌మీద తీసుకుని నిరుపేదల బస్తీలకూ, పల్లెలకూ వెళ్తాడు. ఎక్కడ పది మంది పిల్లలు కనబడితే అక్కడ ఆగి వారికి అక్షరాలు నేర్పిస్తాడు. కథలు చెప్పి నవ్విస్తాడు. మళ్లీ తాను వచ్చేసరికి ఏం నేర్చుకోవాలో చెప్తాడు. పిల్లలు కూడా ఈ సైకిల్ గురూజీ రాకకోసం వేచిచూస్తుంటారు. కాస్త చదవడం వచ్చిన పిల్లలను ప్రోత్సహించి బడిలో చేర్పిస్తాడు. 1995 నుంచీ అతడీ అక్షరాస్యతా యజ్ఞం నిర్వహిస్తున్నాడు.



డిగ్రీ చదివిన ఆదిత్య ఉద్యోగం చేసుకోక ఎందుకీ పనిచేస్తున్నాడూ అంటే 'జీవితానికి చదువు ఎంత అవసరమో నాకు తెలుసు కాబట్టి...' అంటాడతను. పేద కుటుంబం కావడంతో చిన్నవయసులోనే ఆదిత్యని అతని తండ్రి పనిలో పెట్టాడు. దాంతో ఇంట్లోనుంచి పారిపోయి పట్నం చేరాడు ఆదిత్య. చదువుకోవాలన్న అతని పట్టుదల చూసి ఓ ఉపాధ్యాయుడు చేరదీసి చదివించాడు. అందుకే తానూ సాధ్యమైనంత మందిని అక్షరాస్యుల్ని చేయాలన్న ఆదర్శంతో ఇలా సైకిల్ గురూజీ అవతారం ఎత్తాడు ఆదిత్య. 'పిల్లలందరూ బడికెళ్లే పరిస్థితులు లేనిచోట బడే పిల్లలదగ్గరికెళ్లాలి మరి...' అంటాడతను.

## ఐదువేలమందికి విద్యాదానం

తండ్రి స్ఫూర్తితో తానూ సమాజానికి ఏదైనా చేయాలన్న తపన ఓ ఇల్లాలిని ఐదువేల మందికి విద్యాదానం చేసేందుకు ప్రేరేపించింది. గుజరాత్‌కు చెందిన బీనారావు సూరత్‌లోని మురికివాడల పిల్లలకు ఉచితంగా ట్యూషన్ చెప్పడం ప్రారంభించారు. సంగీతకారుడైన ఆమె తండ్రి అంధవిద్యార్థులకు ఉచితంగా శిక్షణ ఇవ్వడం చూసిన ఆమె ఈ తొలి అడుగు వేశారు. అదే నేడు 'ప్రయాస్' అనే స్వచ్ఛంద సంస్థగా మారి వందలాది విద్యార్థులకు విద్యాదాత అయింది. సరైన భాష కూడా మాట్లాడడం రాని మురికివాడల పిల్లలు ఇప్పుడు శుభ్రంగా తయారై బడికి వెళ్లడమే కాదు, చక్కని ఆంగ్లంలో సభ్యతగా మాట్లాడగలుగుతున్నారంటే అది బీనా చలవే.

2006లో ఇద్దరు ముగ్గురు పిల్లలతో ప్రారంభమైన ప్రయాస్‌కి ఇప్పుడు సూరత్‌లోనే వేర్వేరు ప్రాంతాల్లో 8 శిక్షణ కేంద్రాలున్నాయి. 34 మంది వలంటీర్లు అక్కడ పాఠాలు చెబుతారు. 1200 మంది విద్యార్థులు చదువుకుంటున్నారు. విద్యాహక్కు చట్టం అమల్లోకి రావడంతో పలు పాఠశాలల్లో విద్యార్థులను ఉచితంగా చేర్పించుకుంటున్నా, బోధనలో మాత్రం వారి పట్ల శ్రద్ధ చూపడం లేదన్న విషయం బీనారావు గమనించారు. అందుకే ఆమె పాఠశాల సిలబస్‌కి అనుబంధంగా పాఠాలు రూపొందించి విద్యార్థుల సామర్థ్యం మెరుగయ్యేందుకు కృషిచేస్తున్నారు. 'ప్రయాస్' కేంద్రాలన్నిటిలోనూ 3 - 8 తరగతుల మధ్య ఉన్న పేద విద్యార్థులకు పూర్తి ఉచితంగా పాఠాలు చెప్తారు. దాంతో అర్థాంతరంగా చదువు మానేసే వారి సంఖ్య గణనీయంగా తగ్గింది. పాఠాలతో పాటు నైతిక విలువలూ నేర్పిస్తారు.



## పదహారేళ్లకే హెడ్మాస్టారయ్యాడు!

ఉపాధ్యాయుడిగా కొన్ని సంవత్సరాల అనుభవం సంపాదించినవారే ప్రధానోపాధ్యాయులు అవుతారు. పశ్చిమ బెంగాల్‌కి చెందిన బాబర్ అలీ మాత్రం పదహారేళ్లకే హెడ్మాస్టారు అయ్యి బీబీసీ చేత 'ప్రపంచంలోనే అత్యంత పిన్నవయస్కుడైన ప్రధానోపాధ్యాయుడు' అనిపించుకున్నాడు. బాబర్‌కి పాఠాలు చెప్పడం అంటే ఎంతిష్టమంటే తొమ్మిదేళ్ల వయసులో తన ఇంటి వాకిట్లోనే బడి మొదలుపెట్టాడు. స్కూలునుంచి రాగానే బడికి వెళ్లని పిల్లల్ని పోగు చేసి పాఠాలు చెప్పేవాడు. కూర్చోబెట్టి అక్షరాలు దిద్దించేవాడు. అలా మొదలైన 'ఆనంద శిక్షా నికేతన్' ఇప్పుడు 300 మంది పిల్లలతో కళకళలాడుతోంది. బాబర్ ప్రధానోపాధ్యాయుడు కాగా మరో పదిమంది టీచర్లున్నారు. పిల్లలెవరూ రూపాయి ఫీజు కట్టరు. టీచర్లెవరూ రూపాయి జీతం తీసుకోరు. చదువుచెప్పాలన్న తపన టీచర్లది. నేర్చుకోవాలన్న జిజ్ఞాస పిల్లలది. ఇవి రెండూ ఉంటే అవసరమైన వస్తువులు వాటంతటవే వస్తాయని వీరి పాఠశాల రుజువు చేసింది. 8వ తరగతి వరకు ఉన్న ఆ బడిని ప్రభుత్వం అన్‌ఎయిడెడ్ పాఠశాలగా గుర్తించింది. ప్రతిష్ఠాత్మక సంస్థల నుంచి 'ఇండియన్ ఆఫ్ ద ఇయర్', 'రియల్ హీరో' లాంటి ఎన్నో అవార్డులు పొందిన పాతికేళ్ల బాబర్ అలీ టెడ్ ప్రసంగాలూ చేస్తుంటాడు. అతడి గురించి మనదేశంలో సీబీఎస్ఈ సిలబస్‌లోనే కాక, యూరోప్‌లోని లగ్జెంబర్గ్ అనే దేశంలోనూ పాఠ్యాంశంగా పేర్కొనడం విశేషం.



అదో గురుకులం. ధ్యానం, యోగా, చదువు, తోటపని, నిద్ర... అంతా నియమబద్ధమైన జీవితం. పిల్లలందరూ ఎంతో బుద్ధిగా గురువుగారు చెప్పినట్లు వింటూ పాఠాలు నేర్చుకుంటారు. అలాంటిది, ఓరోజు ఆశ్రమంలో ఒక పిల్లవాడు దొంగతనం చేస్తూ పట్టుబడ్డాడు. అది చూసిన మిగతా పిల్లలు గురువుగారికి ఫిర్యాదుచేశారు. ఆయన విని ఊరుకున్నారు తప్ప ఆ పిల్లవాడిని ఏమీ అనలేదు. కొన్నాళ్ల తర్వాత ఆ అబ్బాయి మరోసారి దొంగతనం చేస్తూ పట్టుబడ్డాడు. ఈసారీ గురువుగారు మౌనంగా విన్నారే తప్ప ఆ పిల్లవాడిని కోప్పడలేదు. తప్పుచేసినవాడిని గురువుగారు శిక్షించడంలేదని పిల్లలకు కోపం వచ్చింది. దాంతో, ఆ పిల్లవాడిని వెంటనే ఆశ్రమం నుంచి పంపించివేయాలనీ లేకపోతే తామంతా వెళ్లిపోతామనీ పట్టుబట్టారు. అప్పుడు గురువుగారు నవ్వుతూ 'మంచిది నాయనా, మీరంతా విజ్ఞులయ్యారు. మంచీ చెడూ తెలుసుకున్నారు. మీరు మరెక్కడికైనా వెళ్లి విద్య నేర్చుకోగలరు. కానీ వాడికి ఇంకా ఏది మంచో ఏది చెడో తెలియలేదు. అవన్నీ నేను కాకపోతే ఎవరు చెబుతారు వాడికి? అందుకే విజ్ఞత తెలిసేవరకూ వాడు ఇక్కడే ఉంటాడు. మీరు వెళ్లిరండి' అని చెప్పారు శాంతంగా.

ఎందరో గురుదేవులు... అందరికీ వందనాలు! ★

**తమ ఉద్యోగుల్ని యుద్ధం చేయమంటోంది రిలయన్స్ ఇండస్ట్రీస్. ఈ యుద్ధం పోటీ సంస్థలపైన చేసేది కాదు... సంస్థ స్తబ్దతపైన చేసే మార్పు యుద్ధం, వృథాలపైన చేసే ఆదా యుద్ధం, అనుసరణపైన చేసే ఆవిష్కరణల యుద్ధం... దీనిపేరు 'మిషన్ కురుక్షేత్ర'!**



# రిలయన్స్ 'కురుక్షేత్రం'!

గ్రోత్ ఈజ్ లైఫ్(ఎదుగుదలతోనే మనుగడ)... రిలయన్స్ సంస్థ నినాదమిది. సంస్థ ఛైర్మన్ ముఖేష్ అంబానీ ఈ అంశాన్ని బలంగా నమ్ముతారు. ఆయన నిత్య విద్యార్థి. టెలికామ్ రంగంలో అడుగు పెట్టాలనుకున్నపుడు 'కోర్సెరా' వెబ్‌పోర్టల్‌లో ఆ విభాగానికి సంబంధించిన కోర్సులు చేశారు. రిలయన్స్‌ని ప్రపంచంలోనే అత్యంత వినూత్న ఆవిష్కరణల కంపెనీగా తీర్చిదిద్దాలనేది ఆయన లక్ష్యం. అందుకోసమే 'రిలయన్స్ ఇన్నోవేషన్ కౌన్సిల్' విభాగాన్ని ఏర్పాటు చేశారు. భవిష్యత్తు అవసరాలకు తగ్గట్టు కంపెనీ ఏయే రంగాల్లో అడుగుపెట్టొచ్చో ఈ కౌన్సిల్ ఛైర్మన్‌కు సలహా ఇస్తుంది. ఇందులోనూ మళ్లీ ప్రత్యేక విభాగాలున్నాయి. ఆ విభాగాల్లో కీలకమైనది 'మిషన్ కురుక్షేత్ర'. రఘునాథ్ మషేల్కర్ దీని సారథి. ప్రభుత్వ రంగంలోని సీఎస్ఐఆర్(కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసెర్చ్)కి డైరెక్టర్ జనరల్‌గా పని చేశారు మషేల్కర్. ఈయన ప్రస్తుతం రిలయన్స్ బోర్డు సభ్యుడు కూడా. ఉన్నత స్థాయిలో ఉన్నవారే కాకుండా సాధారణ ఉద్యోగులూ కంపెనీ ఎదుగుదలకు ఆలోచనల్ని చెప్పేలా ప్రోత్సహించడమే కురుక్షేత్ర ఉద్దేశం. ఆ ఆలోచనలు సంస్థని కొత్త వ్యాపారాల్లోకి అడుగుపెట్టేలా అయినా, ఉన్న వ్యాపారాల్ని ఇంకా మెరుగ్గా చేపట్టేలా అయినా ఉండాలనేది నియమం.

### మాంద్యంతో మొదలు

2008 ఆర్థిక మాంద్యం సమయంలో వందేళ్లకుపైగా చరిత్ర ఉన్న లీమన్ బ్రదర్స్ లాంటి కంపెనీలు కూడా దివాలా తీశాయి. అప్పుడే అలాంటి ఒడుదొడుకులకు అతీతంగా రిలయన్స్‌ని తీర్చిదిద్దాలనుకున్నారు ముఖేష్. సృజనాత్మకత, వినూత్నత, కాలానుకూల మార్పులు... ఈ మూడింటినీ ప్రోత్సహించేలా మిషన్ కురుక్షేత్ర ప్రాజెక్టుని 2010లో ప్రారంభించారు. దానివల్ల కొంత మార్పు వచ్చింది. కొన్ని అత్యవసర ప్రాజెక్టుల కారణంగా రెండేళ్లు దాన్ని పక్కన పెట్టి 2014లో పునఃప్రారంభించారు. కురుక్షేత్ర ... స్తబ్దతపైన ప్రకటించిన యుద్ధంగా చెబుతారు మషేల్కర్. కేవలం ఆలోచనల బ్యాంకుగానే కాకుండా వాటిని ఆచరణలోకి తెచ్చే వేదికగానూ దీన్ని రూపొందించారు. చాలా కంపెనీల్లో ఇలాంటి పద్ధతి ఉన్నా, దానికోసం ప్రత్యేకంగా ఒక విభాగాన్ని ప్రారంభించడమూ, ఆలోచనలు ఆచరణ దశకు వచ్చేంత వరకూ సాగే ప్రయాణాన్ని తెలియజేయడమూ ఇక్కడ మాత్రమే జరుగుతోంది. వృథాను తగ్గించడం... అది ఆర్థిక వనరులైనా, మానవ వనరులైనా, సంస్థ ప్రాజెక్టుల్ని గరిష్ఠ స్థాయిలో అమలు చేయడం... మొదలైనవి కురుక్షేత్ర లక్ష్యాలు. కురుక్షేత్రలో భాగంగా ప్రతి ఉద్యోగీ తమ ఆలోచనల్ని పంచుకోవచ్చు. ఒకసారి ఆలోచన పంపాక అది ఏ దశలో ఉందన్న విషయాన్ని మిషన్ కురుక్షేత్ర ఆప్, వెబ్ పోర్టల్‌లలో చూడొచ్చు. ఒక విభాగంలో పనిచేసేవారు సంస్థకు చెందిన ఇతర విభాగాలకు సంబంధించిన అంశాలపైనా తమ ఆలోచనల్ని పంపొచ్చు. ఏదైనా విభాగం గురించి ఆలోచనను పంపినపుడు ఆ విభాగంలోని వారు దాన్ని క్షుణ్ణంగా పరిశీలించి ఒక నిర్ణయం తీసుకుంటారు. ఉద్యోగులు తమ విభాగంలోని ఉన్నతాధికారులకు కాకుండా ప్రత్యేక అధికారులకు ఈ ఆలోచనల్ని పంపిస్తారు. ఎంపిక కాని వాటిని మర్యాదపూర్వకంగానే చెబుతారు. ఉద్యోగుల నుంచీ దీనికి మంచి స్పందన వచ్చింది. 2014 నుంచి ఇప్పటివరకూ 18వేల ఆలోచనలను దీనిద్వారా ఉద్యోగులు పంచుకున్నారు. అంటే నెలకు దాదాపు 500 ఆలోచనలు వచ్చాయన్న మాట. వీటిలోంచి 3500 ఆలోచనల్ని ఆచరణ కోసం ఎంపికచేశారు. అందులో 64 శాతం ఆలోచన స్థాయి దాటి ఆచరణ పరంగా ఏదో ఒక దశలో ఉన్నాయి. ముమ్ముందు ఆలోచనల సంఖ్యతోపాటు వాటి ఆచరణతో జరిగే మార్పు కూడా పెరగనుందంటారు మషేల్కర్.

### అవార్డులూ ఉన్నాయ్...

మిషన్ 'కురుక్షేత్ర'లో పాల్గొనే ఉద్యోగులకు ఏటా అవార్డుల్నీ అందిస్తున్నారు. ఈ అవార్డులకు మహాభారతంలోని పాత్రల పేర్లు ఉండటం మరో ప్రత్యేకత. వినూత్నమైన ఆలోచన చెప్పి, దాంతో చెప్పుకోదగిన స్థాయిలో కంపెనీలో మార్పు వస్తే ఆ ఉద్యోగిని ప్రధానమైన 'కృష్ణ' అవార్డుకి ఎంపిక చేస్తారు. తమ విభాగంలో కాకుండా ఇతర విభాగాలకు సంబంధించిన అంశాల్లో ఆలోచనలు పంచుకొని అవి ఆచరణలోకి వస్తే వారికి 'కర్ణ', గరిష్ఠంగా లాభాలు తెచ్చే ఆలోచన ఇచ్చిన ఉద్యోగికి 'యుక్తి', ఉద్యోగుల ఆలోచనల్ని ఎంపికచేసి వాటిని ఆచరణలో పెట్టే సీనియర్ ఉద్యోగులకు 'ఛాంపియన్ ఆఫ్ ఛాంపియన్స్', తమ విభాగాల్లో మిషన్ కురుక్షేత్ర ఆలోచనలతో మార్పు తెచ్చిన మేనేజర్లకి 'సేనాపతి' ... మొదలైన అవార్డుల్ని అందిస్తారు.



ఇప్పటికే కంపెనీ అభివృద్ధిలో కురుక్షేత్ర చెప్పుకోదగిన మార్పులు తెచ్చింది. ఒక ఉద్యోగి ఈథేన్ సరఫరా పైప్‌లైన్ గురించి చేసిన ఓ ఆలోచన కంపెనీకి రూ. 90 కోట్లు మిగిల్చింది. 2016-17 ఆర్థిక సంవత్సరంలో రిలయన్స్ ఇండస్ట్రీస్ 31వేల కోట్ల లాభాలు గడించింది. అందులో కురుక్షేత్రకూ తగిన వాటా ఉందంటారు మషేల్కర్. ఐడియా జీవితాన్నే కాదు, సంస్థల్నీ మార్చేస్తుందన్నమాట!



సత్య నాదెళ్ల, సుందర్ పిచాయ్‌లతోపాటు వినిపించే మరో భారతీయ టెక్ సీయీవో పేరు **శంతను నారాయణ్.** ప్రపంచ ప్రఖ్యాత 'అడోబ్' సంస్థకు దశాబ్దకాలంగా సీయీవోగా ఉన్న శంతను ఈ ఏడాది ఛైర్మన్‌గానూ బాధ్యతలు చేపట్టారు. ఇటీవల అమెరికా ప్రభుత్వం ఆయన్ని 'గ్రేట్ ఇమ్మిగ్రెంట్స్' అవార్డుతో గౌరవించింది. 'ఇమ్మిగ్రెంట్' నుంచి 'గ్రేట్ ఇమ్మిగ్రెంట్'గా శంతను సాగించిన ప్రయాణమిది...



# అడోబ్‌ని నడిపిస్తున్న హైదరాబాదీ!

**శం**తను నారాయణ్... పెరిగింది హైదరాబాద్‌లోనే. తల్లి ఇంగ్లిష్ టీచర్‌గా పని చేసేవారు. తండ్రి ఓ ప్లాస్టిక్ తయారీ పరిశ్రమను స్థాపించారు. హైదరాబాద్ పబ్లిక్ స్కూల్లో చదువుకున్న శంతను, ఉస్మానియా యూనివర్సిటీ నుంచి 'ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యునికేషన్స్'లో ఇంజినీరింగ్ చేశారు. 'తల్లిదండ్రులు చెప్పిందే ఎప్పుడూ కరెక్ట్ కాదు, అదే సమయంలో వారు చెప్పింది కొన్నిసార్లు కరెక్టే' అని చెప్పే శంతనుకి విద్యార్థిగా ఉన్న రోజుల్లో జర్నలిజంపైన ఆసక్తి ఉండేది. కానీ తల్లిదండ్రుల సూచనమేరకు ఇంజినీరింగ్ చేశారు. 'ఆరోజుల్లో బాగా చదివే విద్యార్థులు ఇంజినీరింగ్ లేదంటే మెడిసిన్- ఈ రెండింటి వైపే వెళ్లేవారు. నాకు రక్తం చూస్తే భయం అందుకే మెడిసిన్‌వైపు వెళ్లలేదు' అని చెబుతారు శంతను. మనదేశం నుంచి వేలమంది తల్లిదండ్రులు తమ పిల్లల ఇంజినీరింగ్/మెడిసిన్ చదువు పూర్తికాగానే వారిని అమెరికా పంపుతున్నట్లుగానే శంతను తల్లిదండ్రులూ పంపారు. 'అది తల్లిదండ్రుల కలల్ని నిజం చేయడం, అన్నల అడుగుజాడల్లో నడవడం' అంటారు శంతను. అప్పటికే శంతను అన్నయ్య అమెరికాలోని సిలికాన్ వ్యాలీలో ఓ చిప్ తయారీ కంపెనీలో పనిచేసేవారు. మైక్రోప్రాసెసర్స్‌కు సంబంధించిన అంశాలు తనను కంప్యూటర్ సైన్స్ వైపు వెళ్లేలా చేశాయని చెప్పే శంతను... 1984లో అమెరికా వెళ్లి బౌలింగ్ గ్రీన్ స్టేట్ యూనివర్సిటీ(ఒహైయో)లో కంప్యూటర్స్‌లో మాస్టర్స్ చేశారు. తర్వాత ప్రాంగణ నియామకాల్లో తోటివారంతా పేరున్న బహుళజాతి కంపెనీల్లో స్థిరమైన ఉద్యోగాల్లో చేరితే శంతను మాత్రం 'మెజరెక్స్ ఆటోమేషన్' అనే అంకుర సంస్థలో చేరారు. 'స్టార్టప్‌లో చేరితే నేర్చుకునే అవకాశం బాగా ఉంటుందన్న ఆలోచనతో అందులో చేరాను. నిజంగానే అక్కడ ర్యాపిడ్ ఫైర్ తరహాలో నేర్చుకునే అవకాశం వచ్చింది. ఎక్కువగా ప్రోగ్రామింగ్ చేసేవాణ్ని' అంటారు.

***ఆపిల్‌లో ఉద్యోగం...***

1989లో 'ఆపిల్' సంస్థలో చేరి అక్కడ సీనియర్ మేనేజ్‌మెంట్ స్థాయిలో ఆరేళ్లు పని చేశారు శంతను. అక్కడ 'ఆపిల్ టాక్' పైన పనిచేసిన 'గుర్‌శరణ్ సింగ్ సంధు' రూపంలో తనకు మంచి మార్గదర్శి దొరికారంటారాయన. 'ఎదుటివారికే కాదు, మనకు మనం కూడా ఎప్పుడూ సవాళ్లు విసురుకుంటుండాలి' అన్న సంధూ మాటలు తన కెరీర్ నిర్మాణానికి ఎంతో ఉపయోగపడ్డాయని చెబుతారు. కెరీర్ ఎదుగుదలకు తనలోని మేనేజర్‌నీ, వ్యాపారినీ మెరుగుపర్చుకోవాలనుకున్న శంతను... ఆపిల్‌లో పనిచేస్తూ వారాంతాల్లో క్లాసులకు హాజరవుతూ కాలిఫోర్నియాలోని 'హాస్ స్కూల్ ఆఫ్ బిజినెస్' నుంచి ఎంబీఏ చేశారు. ఆపిల్ తర్వాత 'సిలికాన్ గ్రాఫిక్స్' అనే సంస్థలో 'డెస్క్‌టాప్ అండ్ కొలాబరేషన్ ప్రొడక్ట్స్' డైరెక్టర్‌గా ఏడాదిపాటు పనిచేశారు. 1995 ప్రాంతంలో సిలికాన్ వ్యాలీలో ఇంటర్నెట్ బూమ్ వచ్చింది. పెట్టుబడి సంస్థ ప్రాంగణంలో చెట్టుని ఊపినా కంపెనీ పెట్టడానికి డబ్బు వస్తుందన్నట్లు ఉండేది పరిస్థితి. అందరూ ఇంటర్నెట్ ఆధారిత అంకుర సంస్థలవైపు అడుగులు వేసేవారు. ఇంటర్నెట్‌లో ఫొటోలు షేర్‌చేసుకునే కంపెనీకి మంచి భవిష్యత్తు ఉంటుందని ఊహించి కొద్దిమందితో కలిసి 'పిక్ట్రా' పేరుతో 1996లోనే ఒక వెబ్‌సైట్‌ను ప్రారంభించారు శంతను. ఫొటో షేరింగ్ కాన్సెప్ట్‌లో వచ్చిన మొదటి వెబ్‌సైట్ అది. దీంతోపాటు ఫొటోగ్రఫీ రంగంలో డిజిటల్ వైపు వచ్చే కంపెనీలకు అవసరమైన సేవల్నీ అందించేదీ సంస్థ. 'ఒక సంస్థను ప్రారంభించడం నిజంగా గొప్ప అనుభవం. కానీ పిక్ట్రా ఎదుగుదలకు సకాలంలో నిధులు రాబట్టలేకపోయాం. మా వ్యాపార విధానంలోనూ లోపాలు ఉండటంతో ఆ జర్నీ అనుకున్నంత విజయవంతం కాలేదు. కానీ ఆ అనుభవంతో నేనెంతో నేర్చుకున్నాను. దూరదృష్టితో ఆలోచించడం, వ్యాపారాన్ని భారీస్థాయిలో ఊహించడం, అనుకోని అడ్డంకులను అధిగమించడం... లాంటి అంశాలు తెలిశాయి. ఏటికి ఎదురీదడం అనుభవమైంది' అని చెబుతారు శంతను.

మొదటి ఉద్యోగం తర్వాత శంతనూ ఏ కంపెనీలోనూ ఉద్యోగానికి దరఖాస్తు చేసుకోలేదు. ఎక్కడా ఇంటర్వ్యూకి హాజరుకాలేదు. తెలిసిన వారెవరైనా ఫలానా కంపెనీలో ఆయనకు సరిపోయే ఖాళీ ఉందని చెప్పినపుడు నచ్చితే వెళ్లేవారు. 'హోదా, డబ్బుకంటే ఇష్టమైన పనికే ఓటు వేశాను. ఎంబీఏ తర్వాత చాలామంది తయారీరంగంలోకి వెళ్తే లాభం ఉంటుందని చెప్పేవారు. నేను మాత్రం నా మనసుకు నచ్చిన సాఫ్ట్‌వేర్ రంగంలోనే ఉన్నాను. ఇక్కడ కెరీర్ ప్రారంభంలోనే ఎంతో మంది అద్భుతమైన వ్యక్తుల్ని కలిశాను, వారితో పనిచేశాను. 'మనం మాత్రమే ఏం చేయగలం, ఎంత వరకూ చేరుకోగలం' లాంటి మాటలు వారి దగ్గర వినిపించవు. ఆపిల్‌లో అయితే 'మనం ప్రపంచాన్ని మార్చుతున్నాం' అన్న ఏకైక ఆలోచనతో పనిచేసేవాళ్లం. నేను అభివృద్ధిచేసిన ఉత్పత్తిని కోట్ల మంది వినియోగిస్తారన్న ఆలోచనే గొప్పగా ఉండేది'

అని చెబుతారు శంతను.

### అడోబ్‌తో ప్రయాణం

ఫొటోషాప్ సాఫ్ట్‌వేర్ తయారుచేసిన సంస్థే 'అడోబ్'. ఫొటోషాప్... ఒక సాఫ్ట్‌వేర్‌గా కాకుండా ఒక క్రియగా మారిపోయి ప్రజల్లోకి వెళ్లిందంటే కంపెనీ ప్రాధాన్యాన్ని అర్థం చేసుకోవచ్చు. 1982లో ప్రారంభించిన ఈ సంస్థలో 1998లో అడుగుపెట్టారు శంతను. ప్రారంభంలో 'ఇంజినీరింగ్ టెక్నాలజీ గ్రూప్' వైస్ ప్రెసిడెంట్‌గా బాధ్యతలు నిర్వర్తించారు. 'అడోబ్‌లో పనిచేస్తూ ప్రచురణ రంగంలో, మీడియా రంగంలో మేం తేబోతున్న భారీ మార్పుల్ని చాలా ముందుగానే ఊహించాను' అని చెప్పే శంతను నాయకత్వ నిచ్చెనలో త్వరత్వరగా పైకివెళ్తూ 2005లో కంపెనీ 'చీఫ్ ఆపరేటింగ్ ఆఫీసర్'గా, 2007లో సంస్థ సీఈవోగా బాధ్యతలు చేపట్టారు. రూ.20 వేల కోట్లతో ఫ్లాష్‌ను అభివృద్ధి చేసిన 'మ్యాక్రోమీడియా'ను 2005లో, రూ.11వేల కోట్లతో డిజిటల్ మార్కెటింగ్‌లో అద్భుతాలు సృష్టిస్తున్న 'ఓమ్నిట్రూ'ను 2009లో అడోబ్ చేజిక్కించుకోవడంలో శంతనూ కీలకపాత్ర పోషించారు. 2008 వరకూ ఆదాయంలో స్థిరమైన పెరుగుదలతో వచ్చిన అడోబ్... ఆర్థిక మాంద్యం కారణంగా 2009లో 18 శాతం క్షీణతను చూసింది. తర్వాత ఏడాది కొంత వరకూ నష్టాల్ని తగ్గించుకొని 2011 నుంచి మళ్లీ లాభాలబాట పట్టింది. 2011లో అడోబ్ ఉత్పత్తుల్ని క్లౌడ్ ఆధారంగా అందించాలని నిర్ణయించారు శంతను. ఆ సేవల్లో... డాక్యుమెంట్ క్లౌడ్(డాక్యుమెంట్ల రూపకల్పన, వినియోగం), క్రియేటివ్ క్లౌడ్(డిజైనింగ్ చేసే వారికి), ఎక్స్‌పీరియన్స్ క్లౌడ్(ఖాతాదారుల ఆన్‌లైన్ కదలికల్ని పర్యవేక్షించేందుకు)లు ఉన్నాయి. అడోబ్ చరిత్రలోనే అతిపెద్ద మార్పు అది. 'యథాస్థితిని కొనసాగించడమే మీ వ్యాపార వ్యూహమైతే, అది సరైన వ్యూహం కాదు' అంటారు శంతను. తన హయాంలో ఎన్నో కొత్త ఉత్పత్తులతో, పాత వాటికి అప్‌డేట్‌లు తెస్తూ మార్కెట్‌ను ప్రపంచవ్యాప్తంగా విస్తరించారు. ఫొటోషాప్, ఇలస్ట్రేటర్, ప్రీమియర్ ప్రో లాంటి ఆప్స్ మొబైల్‌లోనూ మంచి ఆదరణ పొందుతున్నాయి. వీరి 'ప్రీమియర్ ప్రో' టెక్నాలజీ ద్వారా సినిమాల్ని ఎడిట్ చేసుకోవచ్చు. సృజనాత్మక రంగంలో ఉన్నవారిలో 90 శాతం ఫొటోషాప్‌ని వాడుతున్నారంటే దాని ప్రాధాన్యాన్ని అర్థం చేసుకోవచ్చు. 'ప్రపంచం డిజిటల్ వైపు వెళ్లేకొద్దీ మా ప్రగతీ బాగుంటుంది. డెస్క్‌టాప్ పబ్లిషింగ్, ఎలక్ట్రానిక్ డాక్యుమెంట్ షేరింగ్, వెబ్ ఆధారిత కమ్యునికేషన్స్‌లో మేం ఇప్పటికే ముందున్నాం' అని చెబుతారు శంతను. 2016లో అడోబ్ ఆదాయం 22శాతం పెరిగి రూ.40 వేల కోట్లకు చేరింది. దీన్లో క్లౌడ్ సేవల నుంచే ఎక్కువ మొత్తం వచ్చింది.

### ఛైర్మన్‌గా బాధ్యతలు

స్వతహాగా మృదు స్వభావి అయినా వ్యాపారంలో మాత్రం శంతనుది దూకుడే. 2010లో అడోబ్ ఫ్లాష్ టెక్నాలజీ వృథా అన్న ఆపిల్ వ్యవస్థాపకుడు స్టీవ్ జాబ్స్ మాటలకు శంతను అంతగా ప్రాధాన్యమివ్వలేదు. మిగతా ఖాతాదారులకు ఫ్లాష్ గురించి వివరించి దాన్ని వినియోగించేలా చేసి తన బాట సరైనదేనని నిరూపించారంతే. ఇప్పుడు మైక్రోసాఫ్ట్, ఆపిల్ కంపెనీలతో ఒక విధంగా పోటీ పడుతూనే మరో విధంగా భాగస్వామిగానూ ఉంది అడోబ్. కంపెనీ పాలక మండలి ఈ ఫిబ్రవరిలో శంతనుకు సంస్థ ఛైర్మన్‌గా పదోన్నతి కల్పించింది. 'ఇదో గొప్ప గౌరవం. ఆత్మవిశ్వాసం కలిగి, బృందంతో సహకరిస్తూ పనిచేసే స్వభావం ఉండేవాళ్లని కంపెనీలోకి ఆహ్వానిస్తాను. అలాంటివాళ్లు పోటీతత్వంతో పనిచేసి తమతోపాటు సంస్థనీ అభివృద్ధి చేస్తారు' అని చెబుతారు శంతను. ఇండియాలో సాఫ్ట్‌వేర్ రంగం సాధిస్తున్న ప్రగతిని చూస్తుంటే ముచ్చటేస్తుందని చెప్పే శంతను... భారత్‌లోనూ అడోబ్‌ని విస్తరింపజేస్తామంటారు. అడోబ్‌కు ప్రపంచవ్యాప్తంగా 17వేల మంది ఉద్యోగులుంటే, భారత్‌లో వారి సంఖ్య ఆరువేలు. ప్రస్తుతం బెంగళూరు, నోయిడాలలో కార్యాలయాలున్నాయి. 'అడోబ్ భారతీయ విభాగం సాధారణ పనులు చేయడంలేదు. వారు ఆవిష్కరణలవైపు వెళ్తున్నారు' అని ఆనందం వ్యక్తంచేసే శంతను, 'సాంకేతిక రంగంలో ఏదీ శాశ్వతం కాదు, ఎంత గొప్ప ఆవిష్కరణకైనా జీవిత కాలం స్వల్పంగానే ఉంటుంది' అంటారు. ఈ పోటీ ప్రపంచంలో మిమ్మల్ని ముందుకు నడిపే అంశాలేంటని అడిగితే, 'నేను అడోబ్‌లో పనిచేస్తున్నానని చెప్పినపుడు ఎదుటివారి ముఖంలో ఒక వెలుగు కనిపిస్తుంది. ఫొటోషాప్, ఆక్రోబాట్, పీడీఎఫ్‌లు తమ జీవితంలో ఎంతలా భాగమైపోయాయో చెబుతారు. అవన్నీ మానసికంగా ఉల్లాసాన్నిస్తాయి. ఇంకా, ఈరోజు ఏదో నేర్చుకోవాలి, సాధించాలన్న తపనతో నిద్రలేచే మనిషిని నేను' అని చెబుతారు.

### నేను ఉస్మానియన్‌నే...'

'స్కూల్ రోజుల్లో స్నేహితులూ, క్రీడలూ, ప్రత్యేక కార్యక్రమాల తర్వాతే చదువుకి సమయం కేటాయించేవాణ్న'ని చెప్పే శంతను, 1981 ఆసియా క్రీడల్లో సెయిలింగ్‌లో భారత్‌కు ప్రాతినిధ్యం వహించారు. హైదరాబాద్‌లో ఉన్న తల్లిదండ్రుల దగ్గరకు తరచుగా వస్తుంటారు. '1980తో పోల్చితే హైదరాబాద్‌లో ట్రాఫిక్ 20రెట్లు పెరిగి ఉంటుంది. అప్పట్లో రోడ్డుపక్కన దొరికే పదార్థాల్ని కొని తినేవాళ్లం. ఇప్పుడా సాహసం చేయలేను' అని చెబుతారు. తన ఎదుగుదలకు పునాది ఉస్మానియా క్యాంపస్‌లోనే పడిందంటారు. 'నేను ఎప్పటికీ ఉస్మానియన్‌నే' అంటారు శంతను. ఈయన తండ్రి లక్ష్మీనారాయణ్ కూడా ఇదే కాలేజీ పూర్వ విద్యార్థి. గతేడాది ఓయూ ఇంజినీరింగ్ కాలేజీ ప్రపంచ పూర్వవిద్యార్థుల సమావేశానికి ముఖ్య అతిథిగా హాజరై- అమెరికా యూనివర్సిటీలో సీటుకోసం తనకి సిఫార్సు లేఖ రాయడానికి ఓ ప్రొఫెసర్ నిరాకరించారనీ, క్లాసులో ఇద్దరు అత్యుత్తమ విద్యార్థులకే ఆ అవకాశమని చెప్పారనీ, అంతటి విలువలూ క్రమశిక్షణ ఉండేవనీ ఆ వేదికపైన గుర్తుచేసుకున్నారు. ఓయూ శతాబ్ది ఉత్సవాలకు హాజరవుతాననీ చెప్పారు. ★



ఎం.ఎస్.లో తన సహాధ్యాయి రేనీని పెళ్లిచేసుకున్నారు.

★ వీరికి ఇద్దరు అబ్బాయిలు... శ్రావణ్, అర్జున్. ఇద్దరూ టెక్నాలజీ రంగంలో స్థిరపడ్డారు. సాంకేతిక రంగంలో వస్తున్న మార్పుల గురించి శంతను వీరితో తరచూ చర్చిస్తుంటారు.

★ ఏడాదిలో 90 రోజులు పర్యటనల్లోనే ఉండే శంతనుకు ఇంట్లో బెడ్‌పైన తప్పించి ఎంత గొప్ప హోటల్‌లో పడుకున్నా నిద్రపోయినట్లుండదట.

## గోల్ఫ్ ఆడాల్సిందే...

★ గోల్ఫ్, టెన్నిస్ ఇష్టం. వారాంతాల్లో గోల్ఫ్ కచ్చితంగా ఆడతారు. 'అడోబ్‌లో లేకుంటే, ప్రొఫెషనల్ గోల్ఫర్‌ను అయ్యుండేవాణ్ని' అంటారు.

★ ప్రభుత్వ పాలనలో సాంకేతికత వినియోగంపైన ఒబామా అధ్యక్షుడిగా ఉన్న కాలంలో నియమించిన సలహా మండలిలో సభ్యుడు.

★ శంతను పేరున అయిదు పేటెంట్లు ఉన్నాయి.

★ నచ్చే పుస్తకం... అయన్ ర్యాండ్ రాసిన 'అట్లాస్ ష్రగ్డ్', నచ్చే సినిమా 'ది గాడ్ ఫాదర్'.

★ తన సేవలకుగానూ కంపెనీ నుంచి శంతను గతేడాది వివిధ రూపాల్లో పొందిన మొత్తం రూ.130 కోట్లు.





**మండే ఎండల్లో చెప్పుల్లేకుండా కిలోమీటరు నడవగలరా... అదీ కాళ్లు కాలుతున్నాయనే బాధను కళ్లలో కనిపించనీయకుండా... తొందరపడి అసాధ్యం అనేయకండి. చిత్తూరు జిల్లాలోని ఆ గ్రామాల్లో పెద్దల నుంచి పిల్లల వరకూ ఎవరైనా ఈ పనిని సునాయాసంగా చేసెయ్యగలరు. వాళ్లసలెప్పుడూ చెప్పులు వేసుకోరు మరి.**

# కాలికి చెప్పు... ఆ ఊళ్లో తప్పు!

మనతోనే ఉంటారు. మనలానే ఉంటారు. వాళ్లూ తెలుగు ప్రజలే. కానీ వారి ఆచారవ్యవహారాల గురించి తెలిస్తే మాత్రం నాగరిక సమాజం అవాక్కవాల్సిందే. ఇది ఆంధ్రప్రదేశ్‌లోని చిత్తూరు జిల్లా, పాకాల మండలంలోని వేమయ్య ఇండ్లు, ఐరాల మండలంలోని దేవర ఇండ్లు గ్రామాల పరిస్థితి. ఇక్కడ నివసించే పాల ఏకిరి జాతి ప్రజల జీవన శైలి ఎంత భిన్నంగా ఉంటుందన్నది ఆ గ్రామాల పొలిమేరల్లోకి అడుగు పెడితేనే తెలిసిపోతుంది. ఎందుకంటే ఆ ఊళ్లలో అడుగు పెట్టాలంటే ఎవరైనా పొలిమేరల్లోనే చెప్పులు తీసెయ్యాలి. గ్రామంలో ఎవరూ చెప్పులు వేసుకోకూడదన్నది అక్కడి ప్రజలు అత్యంత నిష్ఠగా పాటించే సంప్రదాయం. ఇక, ఈ ఊళ్లలో పుట్టినవారైతే పిల్లల దగ్గర్నుంచి వృద్ధుల వరకూ జీవితాంతం చెప్పులో కాలు పెట్టకూడదనేది మరో నియమం. అందుకే, వారు వందల కిలోమీటర్ల దూర ప్రయాణం చెయ్యాల్సొచ్చినా చెప్పుల్లేకుండానే తిరిగేస్తుంటారు. చెప్పులేసుకుంటే వచ్చే నష్టమేంటని ఎవరైనా అడిగితే 'గ్రామంలో ఉన్న కులదైవం ఆగ్రహిస్తాడు. ప్రాణాపాయం తప్పదు' అంటారు. ఇంతకీ వారి ఆరాధ్య దైవం ఎవరో తెలుసా... సాక్షాత్తూ వేంకటేశ్వరస్వామి వారే. ఇంకా విచిత్రం ఏంటంటే... స్థానికంగా ఉన్న తిరుమలకు దేశం నలుమూలల నుంచీ భక్తులు వస్తుంటారు కానీ వేమయ్య ఇండ్లు, దేవర ఇండ్లు ప్రజలు తిరుమలలో అడుగు పెట్టరు. తమ గ్రామంలో ఉన్న వేంకటేశ్వరుని ఆలయానికే వెళ్తారు. ఇక, మామూలుగా ఎవరైనా గుళ్లోకి మాత్రమే చెప్పులు వేసుకెళ్లరు. కానీ తమ ఊళ్లో స్వామి వారి ఆలయం ఉందన్న కారణంతో వీళ్లు ఎవరినీ గ్రామంలోకి చెప్పులు వేసుకు రానివ్వరు.



నెలనెలా ఇదే పరిస్థితి...

## చదువూ మానేస్తున్నారు

వేమయ్య ఇండ్లు, దేవర ఇండ్లు గ్రామాల్లో పాదరక్షలు వేసుకోకూడదనే ఆచారాన్ని ఏ స్థాయిలో పాటిస్తున్నారంటే... పాఠశాలల్లో యూనిఫామ్‌లో భాగంగా చెప్పులు తప్పనిసరి అంటే ఇక్కడివారు పిల్లల చదువునూ మాన్పించేస్తున్నారు. చాలామంది అలాగే చదువుకి దూరమయ్యారు. ఒకరిద్దరు మాత్రం ఊరిబయటికెళ్లాక చెప్పులు వేసుకుని తిరిగొచ్చేటపుడు మళ్లీ వాటిని పొలిమేరల్లో దాచి వస్తున్నారు. 'సంప్రదాయం కారణంగా నాకెంతో ఇష్టమైన చదువుని పక్కన పెట్టలేక ఊరి బయటికెళ్లాక చెప్పులు వేసుకుని కాలేజీకి వెళ్తున్నా' అంటాడు ఎంబీయే చదువుతున్న మనోహర. ఈ గ్రామాలకు కోడళ్లుగా వచ్చే మహిళలు కూడా ఇక్కడి పద్ధతుల్ని తు.చ తప్పకుండా పాటించాల్సిందే. ఇక ఎప్పుడూ చెప్పులు వేసుకోరు కాబట్టి, వేమయ్య ఇండ్లు, దేవర ఇండ్లు గ్రామస్థుల పాదాలు రాటు దేలిపోయి ఎంత ఎండలో నడిచినా వేడిగా అనిపించదట. కానీ గ్రామస్థుల బంధువులెవరైనా వస్తే మాత్రం చెప్పుల్లేకుండా నడవడానికి నానాతంటాలూ పడుతుంటారట. ఈ రెండు గ్రామాల్లో ఇలాంటి నమ్మకాలు మరెన్నో ఉన్నాయి. ఇక్కడి ప్రజలు బయటివారు వండిన వేటినీ ముట్టరు. అందుకే, ఊరు దాటి వెళ్తే వెంట కచ్చితంగా నీరు, తినడానిక్కావల్సిన పదార్థాల్నీ పట్టుకెళ్తారు. తప్పనిసరి పరిస్థితుల్లో దూర ప్రాంతాలకు వెళ్లి నాలుగైదు రోజులుండాల్సి వచ్చినా ఏ పండ్లతోనో కడుపు నింపుకుంటారు తప్ప ఎక్కడా భోజనాన్ని ముట్టరు. 'ఓసారి పనిమీద హైదరాబాదు వెళ్లి తిరిగొచ్చేసరికి నాలుగురోజులు పట్టింది. పండ్లు తిని గడిపా కానీ బయట ఎక్కడా మెతుకు ముట్టలేదు' అంటాడు గ్రామానికి చెందిన 80ఏళ్ల ఎర్రన్న. దగ్గరి బంధువుల ఇళ్లకు వెళ్లినపుడు వాళ్లు కొత్త కుండలో వండిపెడితే మాత్రం తింటారు. ఆఖరికి ఈ గ్రామాల్లోని పెద్దలు తమ పిల్లల్ని ప్రాథమిక పాఠశాలల్లో పెట్టే మధ్యాహ్న భోజనాన్ని కూడా తిననివ్వరు. ప్రభుత్వ బడుల్లో చదువుకోవడానికి వెళ్లేవారు మధ్యాహ్నం భోజనానికి ఇంటికి వచ్చేస్తారు. అన్నట్లూ వీరికి మరో పట్టింపు కూడా ఉంది. బయటివారెవరైనా తమను ముట్టుకుంటే మైలపడిపోయినట్లూ భావిస్తారు. అందుకే, ఎక్కడికైనా వెళ్తే ఇంటిబయటే స్నానం చేసి లోపలికెళ్తారు. బడి నుంచి మధ్యాహ్నం భోజనానికి వచ్చిన పిల్లలకూ బయటే కూర్చోబెట్టి అన్నం పెడతారు.

## నెల నెలా శిక్షే

వేమయ్య ఇండ్లు, దేవర ఇండ్లు గ్రామాల్లో ఉన్న మరో వింత కట్టుబాటు గురించి తెలిస్తే ఈ కాలంలో కూడా మహిళల పట్ల ఇంత అమానుషంగా ప్రవర్తిస్తున్నారా... అని ఆశ్చర్యపోవాల్సిందే. అక్కడి మహిళలు బహిష్టు సమయంలో ఊరి బయట ఏర్పాటు చేసిన చిన్నపాటి పాకల్లోనే ఉండాలట. ఎండా వానా పగలూ రాత్రీ పురుగు పాముూ... ఏది ఏమైనా ఆ నియమం తప్పడానికి వీల్లేదు. తొలిసారి పుష్పవతి అయిన అమ్మాయిలైతే 12 రోజులపాటూ అక్కణ్నుంచి కదలకూడదు. ఇంట్లో వాళ్లు రోజుకి రెండుమూడు సార్లు భోజనం ఇచ్చి వెళ్లిపోతారు. ఇలా చెప్పుకుంటూ పోతే ఈ గ్రామాల్లో ఎన్నో వింత ఆచారాలు. సంప్రదాయం పేరుతో స్వయంగా గ్రామస్థులే అభివృద్ధికి దూరంగా ఉండిపోతున్నారు. ఇప్పటికీ అక్కడ అన్నీ పూరి గుడిసెలే. ప్రభుత్వ పక్కా ఇళ్లు మంజూరైనా గృహ నిర్మాణాలకు వేరేవాళ్లు గ్రామాల్లోకి రావడం ఇష్టం లేక వాటిని వదులుకున్నారు. ఇంకా ఇలాంటి ఆచారాలు ఉన్నాయంటే ఆశ్చర్యంగా ఉంది కదూ..!

– కరీముల్లా షేక్, ఈనాడు, చిత్తూరు

ఫొటోలు: చొప్పా సుబ్రమణ్యం

# మీ చిన్నారికి చర్మంపై దద్దుర్లు రాకుండా చూడండి



చర్మం అనేది చిన్నారుల యొక్క అతిపెద్ద ఇంద్రియ అవయవమే కాకుండా అత్యంత ప్రధానమైనది కూడా, ముఖ్యంగా తొలి రోజులలో. కావున, వారి చర్మాన్ని సంరక్షించడం మరియు ఆరోగ్యకరంగా ఉంచడం చాలా కీలకమైన అంశం మరియు అది వారు సౌకర్యవంతంగా భావిస్తారు. చిన్నారులు స్పర్శకే స్పందిస్తారు మరియు కొన్నిసార్లు తమ స్వంతవారు స్పృశించటాన్ని గుర్తించటానికి ఈ స్పర్శ దోహదపడుతుంది.

వారి చర్మాన్ని శ్వాసించనివ్వడం మరియు చర్మానికి దురద పెట్టే వాటి నుండి చిన్నారుల చర్మాన్ని దూరంగా ఉంచడం చాలా ముఖ్యం. తరుచుగా, చిన్నారుల క్రింది భాగాలు మూత్రము కారణంగా పలుమార్లు తడి తగలడం వలన దద్దుర్లు ఏర్పడతాయి. చర్మం యొక్క సరైన pH స్థాయి ఆమ్లజనితమౌతుంది కావున అది దద్దుర్లు మరియు దురదను కలుగజేస్తుంది.

తేమను-గ్రహించే గుణాలు కలిగిన డిస్పోజబుల్ డైపర్లు తడిని అలానే పట్టిఉంచే క్లాత్ న్యాపీల కన్నా ఉన్నతమైనవని అధ్యయనాలు తెలిపాయి. డైపర్లు చర్మం యొక్క pH విలువను స్థిరీకరిస్తాయి మరియు కావున చికాకును నిరోధించటానికి దోహదపడతాయి. వాస్తవానికి, సరైన విరామాలకు క్రమం తప్పకుండా వాటిని మార్చడంవలన దద్దుర్లు రాకుండా తోడ్పడతాయి. ఔషదాన్ని కలిగియున్న ప్యాంపర్స్ ప్యాంట్స్ లాంటి డైపర్లు సంరక్షణను కలుగజేసే తేలికపాటి నీటి-వికర్షక పొరను ఏర్పరుస్తాయి. ఈ పొర చర్మం మీద తడికి వ్యతిరేకంగా పనిచేస్తుంది మరియు దురదలకు వ్యతిరేకంగా రక్షణను కల్పిస్తుంది.

## మీ చిన్నారికి ప్యాంపర్స్ ప్యాంట్స్ ఉపయోగపడే విధానము

ప్యాంపర్స్ ప్యాంట్స్ వేగంగా ద్రవం నిలుపుదలలో తోడ్పడతాయి మరియు మూత్రానికి మరియు తడికి గురికాకుండా అడ్డుకుంటాయి, అలా దద్దుర్లను నిరోధిస్తాయి. శ్వాసానుగుణ్యత అంశం అనేది డైపర్ వాతావరణంలోని అవసరమైన తేమ స్థాయిలను క్రమబద్ధీకరించటానికి దోహదపడుతుంది. ఇది చర్మాన్ని పొడిగా ఉంచటానికి దోహదపడుతుంది కావున డైపర్ లోపలి నుండి పొడిగా ఉంచుతుంది. ప్యాంపర్స్ ప్యాంట్స్ అవరోధ ఔషదాన్ని కలిగి ఉంటుంది, ఇది పీల్చేశక్తిని బలహీనపరచకుండా చేయడమే కాకుండా చిన్నారి చర్మం యొక్క స్థితిని మెరుగుపరచటానికి సహాయపడుతుంది. డైపర్లకు ఉండే మెత్తటి ఎలాస్టిక్ కఫ్స్ చిన్నారుల కాళ్ళచుట్టూ పట్టి ఉంచుతాయి మరియు కారుటను నిరోధిస్తాయి మరియు చిన్నారుల పొట్ట ఆకారంలోకి అమరేటట్లుగా ఎలాస్టిక్ రూపకల్పన చేయబడినది. కావున, సరైన సైజు ప్యాంట్‌లు ఉపయోగిస్తే అవి చిన్నారిని సౌకర్యవంతంగా ఉంచుతాయి మరియు రోజంతా చురుకుగా ఉండేటట్లు చేస్తాయి.

ప్యాంపర్స్ ప్యాంట్స్, ముఖ్యంగా రాత్రిపూట ఉపయోగించినప్పుడు తడిని నిరోధించుటలో దోహదపడతాయి మరియు చిన్నారికి ఆటంకంలేని నిద్ర అందుతుంది, ఇది చిన్నారి యొక్క సమగ్రాభివృద్ధికి దోహదపడుతుంది.

మీ చిన్నారి యొక్క ఆరోగ్యకరమైన అభివృద్ధిని నిర్ధారించుకొనేందుకు మీరు తల్లిగా మరెన్నో అంశాలపై దృష్టి పెడ్తుంటారు. అయితే, ఇప్పటికే మీరు నిర్ణయం తీసుకోనట్లైతే నేడే నిర్ణయం తీసుకోండి మరియు డైపర్లను వాడటం ప్రారంభించండి.

## మీ చిన్నారి కొరకు ప్యాంపర్స్ ప్యాంట్స్ యొక్క సరైన సైజు ఏది?

| 3-5 కిలోలు | పుట్టిన శిశువు |
|---|---|
| 4-8 కిలోలు | చిన్నవి |
| 7-12 కిలోలు | మీడియమ్ |
| 9-14 కిలోలు | పెద్దవి |
| 12-17 కిలోలు | XL |
| 15-25 కిలోలు | XXL |

# బుల్లెట్... దూసుకుపోతోంది..!

**తార్రోడ్లూ మట్టిరోడ్లూ... కొండలూ గుట్టలూ... వాగులూ వంకలూ... దారేదయినా, దూరమెంతయినా సరే, 'బుల్లెట్'లా దూసుకుపోవడం దాని ప్రత్యేకత. అందుకే అప్పుడూ ఇప్పుడూ మనదేశంలోనే కాదు, ప్రపంచవ్యాప్తంగా అత్యధికంగా అమ్ముడుపోతూ సంచలనం సృష్టిస్తోంది రాయల్ ఎన్‌ఫీల్డ్ ఉరఫ్ బుల్లెట్... మనదైన దేశీ బైక్..!**

'భారీ బైకుల్లో కింగ్...' అనగానే చాలామంది ఠక్కున హార్లీ డేవిడ్‌సన్ అనే చెప్పొచ్చు. ఎందుకంటే ధరలో దానికి సాటి లేదు మరి. కానీ అమ్మకాల్లో బుల్లెట్ జోష్ ముందు అది చతికిలపడిపోయింది. ప్రపంచవ్యాప్తంగా ఏటా హార్లీ-డేవిడ్‌సన్ బైక్‌లు సుమారు 2,50,000 వరకూ అమ్ముడుపోతూ రెండో స్థానంలో ఉంటే, ఏకంగా 7,00,000 బైక్‌లతో రాయల్‌ఎన్‌ఫీల్డ్ అగ్రస్థానంలో నిలిచి, 'బుల్లెట్టు...నా సౌండే వేరు' అంటోంది.

అవునుమరి, 'డుగ్ డుగ్ డుగ్ డుగ్...' అంటూ వచ్చే ఆ శబ్దం వింటే చాలు.... నడక రాని బుడతల నుంచి మంచమెక్కిన తాతయ్యల వరకూ కిక్కెక్కిపోతారు. ఇక, కుర్రాళ్ల సంగతి చెప్పేదేముంది... దాన్ని చూశారంటే చాలు, ఇలా ఎక్కడం అలా దూసుకుపోవడమే. తుపాకీలా డిజైన్ చేసిన బుల్లెట్ చూస్తే, ఏ వయసువాళ్లకయినా మనసు గుర్రంలా దౌడుతీయడం ఖాయం. పెద్దగా ఒకలాంటి వింత ధ్వని చేసే ఇంజినే దాని ప్రత్యేకత. నిజానికి స్ట్రెయిట్ బ్యాక్ సీటుతో కచ్చారోడ్లమీద సైతం నడపడానికి సౌకర్యంగా ఉన్నప్పటికీ అప్పట్లో దీన్ని కొద్దిమంది మాత్రమే కొనేవారు. ఇష్టంఉన్నా ఖరీదు ఎక్కువనో, బరువుగా ఉందనో, బండికి తగ్గ కండలు లేవనో ఇలా భిన్న కారణాలతో అంతా బుల్లెట్టును నడిపే సాహసం చేసేవారు కాదు, రాజసం కోరుకునేవాళ్లు తప్ప. క్రమంగా ఎలక్ట్రిక్ స్టార్టర్, ఫ్యూయల్ ఇంజెక్షన్, ఫైవ్ స్పీడ్ గేర్ బాక్సులు... ఇలా అనేక అదనపు హంగుల్ని సంతరించుకున్న బుల్లెట్, అనేకమందికి నేస్తంగా మారింది. అదీగాక, కేవలం సుమారు రూ.1.64 లక్షలతో 'హిమాలయన్' పేరుతో మనదేశంలో మొదటి అడ్వెంచర్ బైక్‌ను తయారుచేయడంతో యువతకు మరింత నచ్చేసింది. దాంతో పట్టణాలూ నగరాల్లో బుల్లెట్ బాబులంతా గ్రూపులుగానూ క్లబ్బులుగానూ ఏర్పడి, సామాజిక చైతన్యంకోసం రేసుల్లో పాల్గొంటూ, సాహసయాత్రలు చేస్తూ 'తమ రూటే వేరు' అని లోకానికి చాటుతుంటారు. పైగా ఇతర బ్రాండెడ్ వాటితో పోలిస్తే భారీ బైకుల్లో దీని ధరే తక్కువ. సుమారు లక్ష నుంచి రెండు లక్షల రూపాయల ఖరీదులోనే అనేక మోడళ్లు దొరకడం ఒక కారణమైతే, ఎక్కడా సంక్లిష్టత లేకుండా ఎంతో సాదాగా ఉండే డిజైన్‌వల్ల ఎవరికి అనుగుణంగా వారు సులభంగా మార్చుకోగలగడం కూడా ఇది అందరికీ దగ్గర కావడానికి మరో కారణం. ఒక్క మనదేశంలోనే నెలకు 60వేలకి పైగా బైకులు అమ్ముడుపోతున్నాయి. దాంతో రెట్టించిన ఉత్సాహంతో త్వరలోనే 750సిసి, 1000సిసి ఇంజిన్లతోనూ సరికొత్త మోడళ్లతోనూ కుర్రాళ్లకు కొత్త కిక్కివ్వబోతుంది.

## సైనికుల బైక్!

నేడు రాయల్ ఎన్‌ఫీల్డ్‌గా లోకమంతా పరిచయమైన ఈ కంపెనీ, 1893లో ఇంగ్లాండ్‌లో ఎన్‌ఫీల్డ్ సైకిల్ కంపెనీ పేరుతో మొదలైంది. తరవాత రైఫిళ్ల తయారీకీ పేరొందిన ఈ కంపెనీ, 1901లో మొదటి బైక్‌ను తయారుచేసింది. రెండో ప్రపంచ యుద్ధ కాలంలో రక్షణదళాలకోసం తేలికపాటి మోటారుసైకిళ్లను కేవలం 60 కిలోల బరువూ, 125 సిసి టూ స్ట్రోక్ ఇంజిన్‌తో 'ఫ్లయింగ్ ఫ్లీ' పేరుతో తయారుచేసి, పారాచూట్‌ల ద్వారా సైనికులకి అందించేదట. ఆ తరవాత ఇది చెన్నైకి చెందిన మద్రాసు మోటార్స్‌తో ఒప్పందం కుదుర్చుకుని, 'ఎన్‌ఫీల్డ్ ఆఫ్ ఇండియా' పేరుతో 'మేడ్ లైక్ గన్, గోస్ లైక్ బుల్లెట్...' అనే స్లోగన్‌తో మోటారుసైకిళ్లను తయారుచేసింది.



1965లో భారత ప్రభుత్వం సరిహద్దుల్లో పెట్రోలింగ్ కోసం దాదాపు 800 పైగా 350 సి.సి. బుల్లెట్ బైక్‌లను కొనుగోలు చేయడంతో బుల్లెట్టు భారతీయ ఆర్మీ, పోలీసు దళాల అనధికారిక మోటారుసైకిల్‌గానూ; జాతీయ పర్వదినాల్లో రక్షణదళాలు ఈ బైకుల మీద విన్యాసాలు ప్రదర్శించడంతో భారత జాతీయ బైక్‌గానూ ప్రాచుర్యం పొందింది. 1994లో ఎన్‌ఫీల్డ్ కంపెనీ పూర్తిగా మనదేశానికి చెందిన ఐషర్ కంపెనీ హస్తగతమై, 'రాయల్ ఎన్‌ఫీల్డ్' బ్రాండ్‌తో 'బిల్ట్ లైక్ ఎ గన్' నినాదంతో మోటారుసైకిళ్లను రూపొందిస్తూ ప్రపంచవ్యాప్తంగా ప్రాచుర్యం చెందింది. మోటారుసైకిళ్ల తయారీలోనే అత్యంత ప్రాచీనమైన ఈ కంపెనీ, ప్రస్తుతం మనదేశం నుంచి సుమారు 45 దేశాలకు బైక్‌లను ఎగుమతి చేస్తుండటం విశేషం. రోజురోజుకీ పెరుగుతోన్న డిమాండ్ దృష్ట్యా వచ్చే ఏడాదికి అదనంగా మరో రెండు లక్షలు అంటే మొత్తం 9 లక్షలకు పైగా బైకులు తయారుచేయాలనుకుంటోందా కంపెనీ. కొన్ని మోడళ్లకోసం ఏడాదిపాటు వేచి మరీ కొంటున్నారంటే బుల్లెట్టు క్రేజేంటో తెలుస్తోంది. అందుకే 'హార్లీకి ఆ కంపెనీ లోగోను టాటూ రూపంలో వేసుకునే అభిమానులు మాత్రమే ఉంటే, గర్ల్‌ఫ్రెండ్ కన్నా ఎక్కువగా ప్రేమించగలిగే వీరాభిమానులు రాయల్ ఎన్‌ఫీల్డ్‌కే సొంతం' అంటుంటారు బైకు హీరోలు. సో, బైక్ బాబులంతా బుల్లెట్‌కు దాసోహులే అనడంలో నో డౌట్. ★

## బుల్లెట్టా... మజాకా..!

బుల్లెట్‌ను ఇష్టపడేవాళ్లందరికీ బైకుమీద మోజుండకపోవచ్చు. కానీ బైకు ప్రియులంతా రాయల్ ఎన్‌ఫీల్డ్ ఆరాధకులే అన్నది మాత్రం కాదనలేని సత్యం. అందునా పాతకాలం నాటి రెట్రో లుక్‌తో ఉండే రాయల్ ఎన్‌ఫీల్డ్ బైకుల్లో- మోడలేదయినా అటు అమ్మాయిల్నీ అబ్బాయిల్నీ ఇట్టే కట్టి పడేస్తుంది. వాటిల్లో అత్యధిక ప్రాచుర్యం పొందిన తొలి పది బైకులమీదా ఓ లుక్కేద్దామా...

1. రాయల్‌ఎన్‌ఫీల్డ్ బుల్లెట్ 350 యుసిఇ: ఇంజిన్: 346 సిసి, వేగం: గంటకి 100 కి.మీ. ధర: రూ.1,12,500(ఎక్స్ షోరూమ్ ధర)
2. ఎలక్ట్రా: ఇంజిన్: 346 సిసి, వేగం: గంటకి 120 కి.మీ., ధర: రూ.1,26,500
3. క్లాసిక్ 350: ఇంజిన్: 346 సిసి, వేగం: గంటకి 130 కి.మీ., ధర: రూ.1,35,000
4. థండర్‌బర్డ్ 350: ఇంజిన్: 346 సిసి, వేగం: గంటకి 130 కి.మీ., ధర: రూ. 1,45,000
5. బుల్లెట్ 500: ఇంజిన్: 499 సిసి., వేగం: గంటకి 135 కి.మీ., ధర: రూ. 1,65,000
6. క్లాసిక్ 500: ఇంజిన్: 499 సిసి, వేగం: గంటకి 130 కి.మీ., ధర: రూ. 1,75,000
7. క్లాసిక్ 500 డెజర్ట్ స్టార్మ్: ఇంజిన్: 499 సిసి, వేగం: గంటకి 130 కి.మీ., ధర: రూ. 1,78,000
8. క్లాసిక్ 500 క్రోమ్: ఇంజిన్: 499 సిసి, వేగం: గంటకి 130 కి.మీ., ధర: రూ. 1,85,000
9. థండర్‌బర్డ్ 500: ఇంజిన్: 499 సిసి, వేగం: గంటకి 130 కి.మీ., ధర: రూ. 1,87,000
10. కాంటినెంటల్ జిటి 535: ఇంజిన్: 535 సిసి సింగిల్ సిలిండర్, వేగం: గంటకి 145 కి.మీ., ధర: రూ. 2,08,000



# మహేంద్రగిరి... ఎంత బాగుందో..!



**'ప్రకృతిలో మమేకమై కొండాకోనల్లో పర్యటించాలన్నా, మేఘాలమీద నడుస్తున్నట్లో గాల్లో తేలుతున్నట్లో ఉన్న అనుభూతిని సొంతం చేసుకోవాలన్నా, సాహసయాత్రలు చేయాలనుకున్నా... మహేంద్రగిరి ఎక్కాల్సిందే' అంటున్నారు ఇటీవలే అక్కడికెళ్లొచ్చిన శ్రీకాకుళవాసి గేదెల భరత్‌కుమార్.**

ఒడిశాలోనే రెండో అత్యంత ఎత్తైన శిఖరమైన మహేంద్రగిరి పర్వతాన్ని మిత్రులమంతా కలిసి అధిరోహించాలనుకున్నాం. ఒడిశాలోని కొరాపుట్ జిల్లాలోని డియోమలి పర్వతం తర్వాత ఆ రాష్ట్రంలో రెండో అత్యంత ఎత్తైన పర్వతం మహేంద్రగిరే. సముద్రమట్టానికి 4925అడుగుల ఎత్తులో తూర్పుకనుమల్లో ఉన్న ఆ పర్వతాన్ని ఎక్కేందుకు మేము ఒడిశాలోని గజపతి జిల్లా కేంద్రమైన పర్లాఖెమొండికి చేరుకున్నాం. అక్కడినుంచి మూడు బైకులమీద 66 కి.మీ దూరంలోని మహేంద్రగిరి ప్రాంతానికి బయలుదేరాం. ఏడోమైలు, లంజిపోదొరో, జిరంగో, కొయ్‌పూర్, మడవ తదితర గ్రామాలు దాటి ముందుకు సాగాం. వంకరలు తిరిగిన ప్రమాదకరమైన ఘాట్‌రోడ్డు అది. నేల నుంచి నింగి వరకూ పచ్చదనం పరుచుకుందా అనిపించేంతగా అబ్బురపరిచే ఎత్తైన కొండలూ, దారి పొడవునా కనిపించే సెలయేర్లూ, కొండలమీద నుంచి ఉరికే జలపాతాల సోయగాల్ని చూస్తూ 44 కి.మీ మేర సాగిన మా బైకు ప్రయాణం సాహసభరితంగా అనిపించింది.

అలనాటి కుంతీ ఆలయం!

యుధిష్ఠిరాలయం ఇదే!

మడవ గ్రామం దాటాక బుర్ఖత్ సమీపంలోని ఓ సాధువు ఆశ్రమం దగ్గర మా బైకులను నిలిపి కాలినడకన బయలుదేరాం. మూడు వైపులా ఎత్తైన కొండల్నీ కనుచూపుమేరలోని కొండలన్నింటినీ మింగేసిన మేఘాలను చూసి మంత్రముగ్ధులయ్యాం. అప్పటికే అక్కడ చిరుజల్లులు కురుస్తున్నాయి. ఆ వర్షంలో తడుస్తూనే నిటారుగా ఉన్న ఆ కొండల్ని ఎక్కుతూ ముందుకెళ్లాం. కొంతసేపటికి వర్షం తగ్గుముఖం పట్టింది. మహేంద్రగిరి శిఖరాన్ని చేరుకునే క్రమంలో చిన్న చిన్న కొండలెన్నో ఎక్కాం. ఎత్తుకు చేరుతున్న కొద్దీ మేఘాల నడుమ నడుస్తున్నట్లూ ఆకాశాన్ని అందుకున్నట్లూ గాలిలో తేలుతున్నట్లూ అనుభూతి చెందాం.

సూర్యాస్తమయ సమయానికి మేం మహేంద్రగిరిపైకి చేరుకున్నాం. పచ్చదనంతో నిండిన కొండలను ముద్దాడే నీలాకాశంలో కనువిందు చేసే సూర్యాస్తమయ దృశ్యాల్ని కమ్ముకొస్తున్న చిరుచీకట్లు మెల్లమెల్లగా మింగేయసాగాయి. ఆ అందాల్ని చూస్తూనే ముందుకు సాగాం. చిక్కని చీకటి అడవంతా పరచుకుంది. సుదూరంలోని పలు గ్రామాలూ, పట్టణాల్లో రాత్రి పూట వెలిగి ఉన్న వీధి దీపాలు మిణుగురు పురుగుల గుంపులా కనిపించాయి. ఆ చీకటివెలుగుల దోబూచులాటలో అలా నడుస్తూనే ఉన్నాం. దారి పొడవునా పక్షులూ కీచురాళ్ల చిరుశబ్దాలు వీనుల విందు చేశాయి. అలా మధ్యాహ్నం మూడు గంటలకు మొదలైన మా నడక, రాత్రి తొమ్మిది గంటలవరకూ సాగి, ఎట్టకేలకు అక్కడున్న బాబా కుటీరానికి చేరుకున్నాం. మా బృందంలో సభ్యుడైన కోరాడ కృష్ణప్రసాద్‌కు ఆ ప్రాంతం చిరపరిచితం కావడం, గతంలో ఆయన అక్కడికి పలుమార్లు వెళ్లి ఉండటంతో చీకటిపడినా నడకమార్గంలో మేం ఎక్కడా దారి తప్పలేదు.

ఈ దట్టమైన అరణ్యంలో పర్వతశిఖరంపైన చిన్న కుటీరాన్ని ఏర్పాటుచేసుకుని గత పదిహేనేళ్లుగా ప్రఫుల్లబాబా ఒక్కరే నివాసం ఉంటున్నారు. ఓ యాగశాలను ఏర్పాటు చేసుకుని పదిహేనేళ్లుగా నిత్య హోమం నిర్వహిస్తున్నారు. ఆ చుట్టుపక్కల ఆదివాసీలే ఆయనకు అవసరమైన నిత్యావసరాలను అప్పుడప్పుడూ కింది నుంచి పైకి చేరవేస్తుంటారు.

ఆయన యాగశాల ఎదురుగా ఉన్న మట్టికుటీరంలో ఆ రాత్రికి పడుకున్నాం. అప్పటికే అక్కడ కుండపోతగా వర్షం కురుస్తోంది. మరోవైపు చలిగాలి మమ్మల్ని వణికించేస్తోంది. మాతో పాటు దుప్పట్లు తీసుకుని వెళ్లినా అక్కడి చలి నుంచి అవి ఎంతమాత్రమూ కాపాడలేకపోయాయి. దీంతో బాబా తన దగ్గరున్న రగ్గులు కప్పుకోమని ఇచ్చారు. వాటిని కప్పుకొని చలినుంచి రక్షణ పొందాం.



కొండల్ని కమ్మేసిన మేఘమాల!

### ఆధ్యాత్మిక కేంద్రం!

ఏడాది పొడవునా మానవ సంచారమే కనిపించని ఈ ప్రాంతం, మహాశివరాత్రి ముందు రోజు

మాత్రం భక్తులతో నిండిపోతుంది. ఒడిశా, ఆంధ్రప్రదేశ్, పశ్చిమబంగా తదితర రాష్ట్రాల నుంచి వేలాది భక్తులు కాలినడకన తరలి వచ్చి, శివలింగాలను దర్శించుకుంటారు. ముందురోజు రాత్రికే కొండపైకి చేరుకుని అక్కడే చెట్లూ, పొదల మాటున బస చేస్తారు. చలికాలం కావడంతో ఆ సమయంలో ఎటువైపు చూసినా నెగళ్లే కనిపిస్తుంటాయి. ఇటీవల కాలంలో కార్తీక మాసంలోనూ ఈ ప్రాంతాన్ని సందర్శించే భక్తుల సంఖ్య పెరిగింది. ఈ పర్వతంపైనే పరశురాముడు తపస్సు చేశాడనీ చెబుతారు. అందుకు ప్రతీకగా రెండు దశాబ్దాల కిందట ఈ పర్వత శిఖరంపైన పరశురాముడి విగ్రహాన్నీ ఏర్పాటుచేశారు. ధ్యానం, యోగాభ్యాసానికి అనుకూలప్రదేశం కావడంతో వాటి సాధన కోసం వస్తున్న వారి సంఖ్య ఇటీవల పెరిగింది. అలా వచ్చేవారిలో చాలామందికి బాబా మట్టికుటీరమే శరణ్యం. కానీ అది చాలా చిన్నది. అయినా వచ్చేవాళ్లు వంటసామగ్రి వెంట తెచ్చుకుని అక్కడే వండుకుని నిద్రిస్తుంటారు.

### పాండవుల ఆలయాలు

మర్నాడు ఉదయం నిద్రలేవగానే బయటకు వచ్చి చూస్తే మంచుపొరలు చీల్చుకుంటూ వెలుగులు చిమ్మే సూర్యోదయం అనిర్వచనీయ అనుభూతిని మిగిల్చింది. సమీపంలోని బంగాళాఖాతం తీరమూ, గ్రామాలూ, పట్టణాలు అన్నీ కలిసి ప్రకృతి కాన్వస్‌పైన చిత్రకారుడు వేసిన చిత్రాలను తలపించాయి.

మేం బస చేసిన ఆశ్రమానికి సమీపంలోనే పాండవుల ఆలయాలు ఉన్నాయి. వనవాసం సమయంలో పాండవులు కొంతకాలం ఇక్కడ జీవించారనీ, అప్పుడు ఈ ఆలయాలను నిర్మించారనీ చెబుతారు. కుంతి, ధర్మరాజు, భీముడి ఆలయాలు మాత్రమే కనిపిస్తాయి. మిగిలినవి శిథిలమయ్యాయట. ఈ ఆలయాలన్నింటిలోనూ శివలింగాలే ఉన్నాయి. 30 అడుగుల ఎత్తులో ఉన్న కుంతీ ఆలయాన్ని అత్యంత అరుదైన రాతికట్టుతో నిర్మించారు. దీని వాస్తునిర్మాణం ఓఢ్ర శిల్పాన్ని పోలి ఉంది. ఆలయం భూమి లోపలికి దిగినట్లు కనిపిస్తుంది. మెట్లు దిగి లోపలికి వెళ్లాం. ఆలయం ముఖద్వారం పశ్చిమదిశలో ఉంది. ఆలయం వెలుపలి భాగంలో తూర్పున కుమారస్వామి, ఉత్తరాన పార్వతీదేవి, దక్షిణాన విఘ్నేశ్వరుని విగ్రహాలు ఉన్నాయి. ఈ ఆలయం ఎదురుగా రెండు పురాతన బావులున్నాయి. ఎత్తైన కొండమీద వాటిని ఎలా తవ్వారన్న ఆలోచన ఆశ్చర్యానికి గురిచేసింది.

కుంతీ మందిరం నుంచి ఉత్తరదిశలో ఉన్న కొండపైన ధర్మరాజు ఆలయం ఉంది. ఈ పర్వతంపైన ఉన్న ఆలయాలన్నింటిలోకి ఇదే పెద్దది. దీనికి పశ్చిమదిశలో ముఖద్వారం ఉంటుంది. భక్తులు దీన్ని యుధిష్ఠర


వ్యాసకర్త

ఆలయంగా పిలుస్తారు. ఈ ఆలయ నిర్మాణం కళింగ నిర్మాణ శైలిలోని త్రిరథ ఆకారాన్ని పోలి ఉందని చరిత్రకారుల అభిప్రాయం. ఆలయం పక్కనుంచి పారే సెలయేటి సవ్వడి మమ్మల్ని చాలాసేపు అక్కడి నుంచి కదలనివ్వలేదు. ధర్మరాజు ఆలయం ఎదురుగా ఉన్న మరో కొండ శిఖరంపైన భీముడి ఆలయాన్ని కేవలం అయిదు భారీ రాళ్లతో నిర్మించారు. ఆ ఆలయం లోపలికి వెళ్లడానికి చిన్న సందు మాత్రమే ఉంటుంది. మహేంద్రగిరి పర్వతంపైన ఉన్న అన్ని ఆలయాల్లో ఇదే పురాతనమైనది. క్రీ.శ.ఆరో శతాబ్దానికి ముందే ఈ ఆలయాలు వెలుగులోకి వచ్చాయనేది చరిత్రకారుల అభిప్రాయం. ఈ పర్వతం కొసన ఉన్న ఓ కొండపైన జగన్నాథ స్వామి ఆలయం ఉంది. దీన్ని దారుబ్రహ్మ ఆలయంగా పిలుస్తారు. చుట్టూ చెట్లూ వాటి మధ్య రాళ్లూరప్పలతో కూడిన అత్యంత క్లిష్టమైన మార్గంలో ఆ ఆలయానికి చేరుకున్నాం.

### మహేంద్రతనయ నది జన్మస్థలం

స్నానపానాదులు ముగించుకుని మహేంద్రతనయగా పిలిచే నది పుట్టిన ప్రదేశం చూడ్డానికి వెళ్లాం. ఒడిశాలోని గజపతి, ఆంధ్రప్రదేశ్‌లోని శ్రీకాకుళం జిల్లాల్లోని వేల ఎకరాలకు తాగు, సాగునీరును అందించే మహేంద్రతనయ ఈ పర్వతంలోనే పుట్టింది. అయితే అది ఎక్కడన్నది కచ్చితంగా చెప్పలేం. దాని ఆనవాళ్లుగా అనేక ప్రవాహాలు చూపిస్తారు. ఎందుకంటే మహేంద్రగిరి పర్వతంపైన ఏడాదిపొడవునా వర్షం కురుస్తూనే ఉంటుంది. ఈ వర్షపు నీరు ఆ కొండపైన అనేక సెలయేర్లుగా, జలపాతాలుగా పారి కిందికి వచ్చేసరికి నది రూపును సంతరించుకుని, రెండు పాయలుగా విడిపోతుంది. ఒక పాయ శ్రీకాకుళం జిల్లాలోని పాతపట్నం వైపు సాగి, 70 కి.మీ మేర ప్రవహించి గొట్టా బ్యారేజీ వద్ద వంశధార నదిలో కలిస్తే, మరో పాయ మందసవైపుగా సాగి 40 కి.మీ.మేర ప్రవహించి బారువవద్ద సముద్రంలో కలుస్తుంది.

### జీవవైవిధ్యానికి కేంద్రం

మహేంద్రగిరి జీవవైవిధ్యానికీ కేంద్రమే. నెమళ్లు, ఎగిరే ఉడుతలు, రాక్షస తొండలు, ఏనుగులు, మచ్చల జింకలు, మైనాలు వంటి అనేక రకాల అరుదైన జీవజాలానికి ఇది నివాస కేంద్రం. దాదాపు 1200 రకాల జాతులకు చెందిన మొక్కలు ఈ పర్వతంపైన ఉన్నాయని ఒడిశా జీవవైవిధ్య మండలి నిర్వహించిన అధ్యయనంలో తేలింది. ఒడిశా రాష్ట్రంలోని వివిధ పుష్పజాతులకు చెందిన మొక్కల్లో 35 శాతం మొక్కలకు మహేంద్రగిరి ఆవాస కేంద్రమని గుర్తించారు. దాదాపు 300కు పైగా ఔషధ గుణాలు కలిగిన మొక్కలు ఇక్కడ లభిస్తాయి. అతి త్వరగా అంతరించిపోతున్న, అత్యంత అరుదైన ఔషధ గుణాలు కలిగిన మొక్కలు ఇప్పటికీ ఈ పర్వతంపైన లభిస్తున్నాయి.

అక్కడ పూటపూటకీ ఆకాశంలో రంగులు మారిపోసాగాయి. తొలిసంధ్యలో పక్కన ఏముందో కనిపించనంతగా దట్టంగా కమ్మేసిన మంచూ, అంతలోనే చురుక్కుమనిపించే సూర్యోదయం, ఉన్నట్టుండి భోరున కురిసే వర్షమూ సాయంసంధ్యా సమయానికి ఆహ్లాదాన్ని పంచే శీతగాలులూ రాత్రికి ఎముకలు కొరికేసే చలీ... ఇలా ఒక్క రోజులోనే అనుభవంలోకి వచ్చిన అక్కడి వాతావరణానికి అచ్చెరువొందుతూనే పర్వతం మొత్తాన్నీ చుట్టి ఆ సాయంత్రం తిరుగు ప్రయాణమయ్యాం.

### ఎలా వెళ్లాలి?

మహేంద్రగిరిని పర్యటించాలనుకునేవాళ్లకి అక్కడ బస చేయడానికి తగిన సదుపాయాలు లేవు. కాబట్టి ఒడిశాలోని గజపతి జిల్లా కేంద్రమైన పర్లాఖెమొండికి చేరుకుంటే అక్కడ బస చేయడానికి లాడ్జీలు అందుబాటులో ఉంటాయి. విశాఖపట్నం విమానాశ్రయం నుంచి 200 కి.మీ దూరంలో, భువనేశ్వర్ నుంచి 285 కి.మీ దూరంలోనూ పర్లాఖెమొండి ఉంది. ఒడిశాలోని బ్రహ్మపురం రైల్వేస్టేషన్ నుంచి 120 కి.మీ., శ్రీకాకుళం జిల్లా పలాస రైల్వే స్టేషన్ నుంచి 40 కి.మీ దూరం ప్రయాణించీ పర్లాఖెమొండి చేరుకోవచ్చు. పర్లాఖెమొండి నుంచి మహేంద్రగిరికి వెళ్లాలంటే ప్రైవేటు వాహనాల్లో వెళ్లొచ్చు. లేదా కొయిన్‌పూర్ వరకూ ప్రైవేటు బస్సుల్లో ప్రయాణించొచ్చు. వ్యక్తిగత వాహనాల్లో వెళితే బుర్ఖత్ వరకూ చేరుకోవచ్చు. అక్కడ వాహనాలను నిలిపేసి కాలినడకన ఎక్కాల్సిందే. కొయినపూర్‌లో అటవీశాఖ అతిథిగృహం ఉంది. అక్కడ నలుగురు బస చేసేందుకు వీలుంటుంది. అక్కడ కూడా వాహనాలను నిలిపి కాలినడకన పర్వతాన్ని ఎక్కొచ్చు. 

కథ

# అతడు-ఆమె

– చెంగల్వ బొడ్డపాటి రామలక్ష్మి

ప్రియమైన మీకు,

ఎలా ఉన్నారు? వేళకి తింటున్నారా? మీరు అద్దెకుంటున్న ఇల్లు సౌకర్యంగా ఉందా? ఆఫీసులో అందరూ బాగా పరిచయమై ఉంటారనుకుంటున్నాను. మీకు హోటల్ భోజనం పడదుగా, రోజూ చేతులు కాల్చుకుంటున్నారా?

ఇక్కడ నేనూ పిల్లలూ క్షేమం. ఈతరం పిల్లలను పెంచటం, వారి మనోభావాలను అర్థంచేసుకోవటం చాలా కష్టమనిపిస్తోందండీ! మీరు ఉద్యోగరీత్యా దూరంగా వెళ్ళాక వీళ్ళ పెంపకం నాకో సవాలుగా తయారైంది. మీరిచ్చిన స్ఫూర్తితో, ధైర్యంతో నా బాధ్యతను సక్రమంగా నెరవేర్చటానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నాను.

శ్రావ్య డిగ్రీ రెండో సంవత్సరం రిజల్ట్స్ వచ్చాయి. అత్తెసరు మార్కులు అన్నీ. అది కోరుకున్న కాలేజీలోనే చేర్పించాం. మనలా మన పిల్లలు కష్టపడకూడదని అది కావాలన్న సౌకర్యాలన్నీ అమర్చాం. తెలివితేటలుండీ చదవగలిగీ కూడా ఎందుకిలా చేసిందో అర్థం కావట్లేదు. గట్టిగా కేకలేస్తే కోపంతో ఏం చేస్తుందోనని భయం. నెమ్మదిగా నచ్చచెప్తుంటే ఎదురు తిరుగుతోంది.

ఇక, శరత్ అయితే- ఎప్పుడూ స్నేహితులూ ఫోన్లలోనే గడిపేస్తున్నాడు. వాడి చదువూ అంతంతమాత్రంగానే ఉంది. వీళ్ళకి మనమివ్వగలిగిన ఆస్తి చదువేకదండీ! ఈమాత్రం అవకాశం లేక ఎంతమంది పిల్లలు ఎలా కష్టపడుతున్నారో వీళ్ళకి ఎలా తెలుస్తుంది? చెప్పినా వినరు. ఇలాంటి చదువులతో వీళ్ళకి మంచి ఉద్యోగాలేం వస్తాయి? పెళ్ళిళ్ళెలా అవుతాయి? మీరున్నంత వరకూ మీరే వీళ్ళ చదువునోకంట కనిపెడుతూ ఉండేవారు. నాకు ఉద్యోగం, ఇంటిపనులతోనే సరిపోయేది. ఇప్పుడు ఈ అదనపు బాధ్యత నన్ను చాలా భయపెడుతోంది. అన్నట్టు, మన పనమ్మాయి జయమ్మ కొడుకు వెంకటేశు బాగా చదువుతూ తొంభై పైన మార్కులు తెచ్చుకుంటున్నాడు. మనం కడుతున్న ఫీజులూ, పుస్తకాల ఖర్చును సార్థకం చేస్తున్నాడు. అదొక్కటే కాస్త తృప్తి.

మీకు ముఖ్యంగా ఇప్పుడు రాయటమెందుకంటే- పెద్దమ్మాయి శుభ వచ్చి నాలుగు రోజులయిందండీ. పెళ్ళయి ఏడాది కూడా కాలేదు. భర్తతో గొడవపడి వచ్చేసింది. మామూలుగా అందరి ఇళ్ళలో జరిగే చిన్నచిన్న విషయాలకే తగాదాపడి వచ్చేసిందండీ. 'నేను వెళ్ళను, నా ఉద్యోగం నాకుంది' అంటుంది.

వాళ్ళది ప్రేమ వివాహం. ఇద్దరూ ఇష్టపడుతున్నారనీ అది సుఖపడుతుందనీ వాళ్ళ పెద్దవాళ్ళతో మాట్లాడి ఎంతో ఖర్చుతో ఘనంగా చేశాం కదండీ. వ్యక్తిత్వమంటే ఇదేనా! ఒకరిమాట ఒకరు గౌరవించుకోకుండా పట్టుదలలతో కాపురం కూల్చుకోవటమేనా? ప్రేమకర్థం వీళ్ళకి తెలుసా?



మనదీ ప్రేమ వివాహమే కదండీ. మీకు గుర్తుందా... మన ప్రేమ మీ ఉత్తరంతోనే మొదలైంది. మనం ఒకే క్లాసులో చదువుతున్నా ఎప్పుడూ మాట్లాడుకోలేదు. మీరు ఒకరోజు మీ ఇష్టాన్ని తెలియజేస్తూ లెటర్ రాసి నా పుస్తకంలో పెట్టారు. అప్పటినుండీ పరస్పరం రాసుకున్న లేఖల ద్వారానే మన ప్రేమ దినదిన ప్రవర్ధమానమై పెళ్ళిదాకా వచ్చింది. ఎదురుగా ఉంటూనే ఉత్తరాల ద్వారా మనోభావాలను వ్యక్తం చేయటం ఒక అందమైన అనుభూతి కదా. ఇప్పుడు ఉద్యోగరీత్యా మీరు చాలా దూరంలో ఉండటం, పిల్లల చదువుకోసం నేనిక్కడే ఉండిపోవటం వల్ల ఉత్తరం రాసే అవసరం, అవకాశం వచ్చాయి కానీ, లేకపోతే ఈ రోజుల్లో ఉత్తరాలెవరు రాస్తున్నారు చెప్పండి. ఏమైనా, చాలా రోజుల తరవాత ఇలా రాస్తుంటే కొత్తగా ఉంది. మీతో ఫోన్‌లో కూడా మాట్లాడొచ్చనుకోండీ, అయినా ఉత్తరాల ద్వారా మనసు వ్యక్తం చేయటం మనకిద్దరికీ ఇష్టమైన అంశం కాబట్టి ఇలా రాస్తున్నాను.

పెళ్ళయిన కొత్తలో మనం ఎన్ని ఇబ్బందులు ఎదుర్కొన్నామో మీకు గుర్తుందా? నేనైతే ఎప్పటికీ మర్చిపోను. మనలాంటి పరిస్థితులు మన పిల్లలకి లేవు. అయినా సర్దుకోలేకపోతున్నారు. వాళ్ళకి అంతగా ఇష్టంలేకపోయినా చేసుకున్నామని కొత్తలో మా అమ్మా నాన్నా మీతో సరిగా మాట్లాడకపోయినా, మీరు బాధనంతా మనసులోనే దాచుకుని వాళ్ళలో మార్పు వచ్చేదాకా నిరీక్షించారు. మీ మంచితనంతో వాళ్ళ మనసును గెలుచుకున్నారు. ఇప్పుడు మీరు వాళ్ళకి కొడుకుకన్నా ఎక్కువ.

భార్యాభర్తలన్నాక చిన్నచిన్న అభిప్రాయభేదాలూ కీచులాటలూ లేకుండా ఎలా ఉంటాయి? అలా లేకపోతే అది కాపురం ఎలా అవుతుంది? రెండు రోజులు కోపంతో మాట్లాడుకోకుండా తరవాత మాట కలుపుకోవటంలోని ఆనందం, ఎడబాటులోని మాధుర్యం ఎంత బాగుంటుంది? ఒకరి ఇష్టాలకోసం మరొకరు సర్దుకుపోవటంలో ఎంత సంతోషం ఉంటుంది!

మీకు గుర్తుందా- ఎప్పుడూ ఎంత దూరాలైనా బస్సుల్లోనే ప్రయాణించే మీరు, నేను మీ జీవితంలోకి వచ్చాక, నాకు బస్సు ప్రయాణం పడదనీ చిన్నచిన్న ఊళ్ళకి కూడా నాతో రైల్లోనే వచ్చేవారు. తోపులాటలు- అందునా పండుగలూ పర్వదినాలలో రద్దీలో క్యూలో తోసుకోవడం- మీకసలు ఇష్టం ఉండదు. కానీ, నాకోసం నాతోపాటు తప్పకుండా గుడికి వచ్చేవారు. మీ అయిష్టాన్ని ఎప్పుడూ వ్యక్తం చేయలేదు.

ఇప్పుడు శుక్రవారం అమ్మవారి గుడికి ఒంటరిగా వెళుతుంటే- భౌతికంగా పక్కన మీరు లేరనే బాధ ఒక పక్కా, మనసులో నాతోపాటే మీరు వస్తున్న ఆనందం మరోపక్క!

భార్యాభర్తల మధ్య ఉండవలసిన ప్రేమ, అవగాహనల గురించి శుభకి చెప్పటానికి ప్రయత్నిస్తే- 'మీ కాలం వేరమ్మా, తనకు నచ్చేట్లు నేనెందుకు ఉండాలి' అంటూ విసుక్కుంటోంది. ఏం చేయాలో అర్థం కావడం లేదు. అక్కడ మీరు ఒంటరిగా ఉన్నారు. ఈ విషయాలన్నీ చెప్పి మిమ్మల్ని బాధపెట్టడం ఇష్టంలేదు కానీ- ఎవరితో

పంచుకోను మీతో తప్పు! మీరిప్పుడప్పుడే రావటం కుదరదు, ఆఫీసులో పని ఒత్తిడి బాగా ఉంది అన్నారుగా, ఒకసారి పిల్లలతో ఫోన్‌లో మాట్లాడతారా?

ఆఫీసు నుంచి అలసివచ్చి అన్ని పనులూ మీరే చేసుకోవాలి. మీ ఆరోగ్యం జాగ్రత్త! వేళకి భోజనం చేయండి. మీ ఉత్తరం కోసం ఎదురుచూస్తూ ఉంటాను. ఉండనా మరి!

ప్రేమతో
మీ సుజా

**ప్రియమైన నీకు,**

నీ ఉత్తరం- నువ్వే నా ఎదురుగా ఉండి చదువుతున్నట్లుగా ఉంది... పాత సినిమాలలో చూపిస్తారే అలా అన్నమాట!

రోజూ ఉదయమే లేచి వంట చేసుకోవాలంటే ఎంత విసుగ్గా ఉంటోందో. ఉదయమే స్టవ్ వెలిగిస్తుంటే నువ్వు బాగా గుర్తొస్తావు. ఒంట్లో బాగున్నా లేకపోయినా నువ్వే వంటింటి పనంతా చేసుకునేదానివి. నిజంగా ఆడవాళ్ళెంత గొప్పవాళ్ళో కదా. ఎంత శ్రమపడతారు! ఎంత సర్దుకుపోతారు!

ఇంటిపని, ఉద్యోగం, పిల్లల పెంపకంతో నువ్వెంత సతమతమవుతున్నావో అర్థమవుతోంది. తెలివితేటలూ జ్ఞాపకశక్తీ లేకపోతే వీళ్ళకి చదువురాదులే అని సరిపెట్టుకునేవాళ్ళం. వీళ్ళకి అన్నీ ఉండి చదువుకోవలసిన వయసులో చదువును నిర్లక్ష్యం చేస్తున్నారు. ఇది వాళ్ళ తప్పుకాదు- వాళ్ళ వయసుది. ఈ దశలో ఉండే కోరికలకూ స్నేహాలకూ వ్యామోహాలకూ వాళ్ళు అతీతులు కారు. ఇంతకుముందు వరకూ మన పిల్లలు బాగానే చదివేవారు. కొంచెం గాడి తప్పుతున్నట్లున్నారు. వాళ్ళతో ఉన్న వాళ్ళ స్నేహితులు ఎలాంటివారో గమనిస్తూ ఉండు.

పిల్లల ఈ వయసులోనే మనం వాళ్ళను జాగ్రత్తగా కాపాడుకోవాలి. బరువంతా నీ ఒక్కదానిమీద వదిలేసి ఇలా రావలసి వచ్చినందుకు చాలా బాధగా ఉంది. అయినా, మానసికంగా నేనెప్పుడూ నీతోనే ఉంటానుగా! స్నేహితులూ, చుట్టూ ఉన్న సమాజం ప్రభావం ఎంత ఉన్నా మన ఇంటి క్రమశిక్షణా, మన భావాల ప్రభావం పిల్లలపై తప్పక ఉంటుంది. వాళ్ళతో నేను మాట్లాడతాన్లే. నేను వచ్చినప్పుడు మనిద్దరం కలిసి చదువూ జీవితపు విలువలను గురించి అర్థమయ్యేలా చెపుదాం. నువ్వు ఎక్కువగా ఆలోచించి ఆరోగ్యం పాడుచేసుకోకు.

మనిద్దరం ఎంతో కష్టపడి నిర్మించుకున్న అందమైన పొదరిల్లు మన కుటుంబం! దీనికి ప్రేమ, అనురాగం, మమత, అనుబంధాలే పునాదులు. దీనిని ఎప్పుడూ పచ్చగా చక్కగా ఉండేటట్లు చూసుకోవలసిన బాధ్యత మనదే.

నీ ఉత్తరం చదువుతుంటే మన పెళ్ళయిన తొలి రోజులూ, నీ అమాయకమైన ముగ్ధమనోహర రూపం కళ్ళముందు



కదలాడుతున్నాయి. పెళ్ళికి ముందు ఉత్తరాలు రాసుకోవటం అలవాటైపోయి, పెళ్ళయ్యాక నువ్వు తమాషాగా నేను ఆఫీసుకి వెళుతుంటే ఉత్తరం రాసి కవరులో పెట్టి నా జేబులో పెట్టేదానివి. నేను ఆఫీసులో చదువుకుని సమాధానం రాసి, ఇంటికి వచ్చాక టేబుల్ మీద పెట్టేవాణ్ణి. ఇలా చాలా రోజులు రాసుకున్నాం కదూ! అదో వింత అనుభూతి! నీ లేఖలోని అంశాలు నీ ఎదుట ప్రస్తావిస్తే సిగ్గుల మొగ్గయిపోయేదానివి. అది చూస్తూ నేను నవ్వుకునేవాణ్ణి. మన చుట్టూ ప్రపంచాన్ని మర్చిపోయి ఆనందంగా గడిపేశాం కదూ. ప్రేమ మహిమ అదే!

కొత్తలో పెద్దవాళ్ళ వల్ల ఎన్ని ఇబ్బందులెదురైనా మనం పెద్దగా పట్టించుకోలేదు. మనం ఒకరికొకరం తోడుగా నిలబడ్డాం. మొదటి సంవత్సరం నువ్వెన్ని ఇబ్బందులు పడ్డావ్! అమ్మా, అక్కయ్యలూ నీమీద ఎంత పెత్తనం చలాయించినా నోరు విప్పకుండా సహనంగా చిరునవ్వుతో భరించావు. నేనెప్పుడైనా కోపంతో ఆవేశపడబోయినా నన్ను మాట్లాడొద్దని బతిమాలేదానివి.

ఒక ఆడపిల్ల పెళ్ళయ్యాక తన పుట్టింటి వాళ్ళందరినీ వదిలి మెట్టినింటికి వచ్చినప్పుడు వాళ్ళు ఆమె బెరుకునూ కొత్తనూ పోగొడుతూ తమలో కలుపుకోవాలి. కానీ, చాలామంది అలా చేయరు. ఇదే అవకాశం అనుకుని కొత్త కోడలిని సతాయిస్తారు. అత్తాకోడళ్ళ మధ్య దూరం పెరిగిపోతుంది. మావాళ్ళూ అలాగే ప్రవర్తించారు. నువ్వు చదువుకున్నదానివి, సహనమున్నదానివి. నీ ఓర్పుతో వాళ్ళ మనసులను మార్చి ఇంటిల్లిపాదికీ అభిమానపాత్రురాలివయ్యావు.

నేను భోజనప్రియుణ్ణి. నాకు వంట బాగా రుచికరంగా ఉంటే కానీ తినలేను. వంట చేయటం రాదని నేను కూడా నిన్ను విసుక్కుని ఉంటాను. కానీ, నువ్వు నాకిష్టమైనవన్నీ నేర్చుకుని చేసిపెట్టావు. నాలో నీకు నచ్చని విషయాల్ని సున్నితంగా, మనసు గాయపడకుండా 'ఇలా ఉంటే బాగుంటుంది' అన్నట్టు సూచనప్రాయంగా చెప్పేదానివి. నీలోని 'నొప్పించక, తానొవ్వక' అనే లక్షణం నాకు చాలా ఇష్టం.

మనం మొదట్లో ఏమనుకున్నాం... ప్రతి పెళ్ళిరోజునాడు- ఆ ఏడాదిలో మనమధ్య వచ్చిన భేదాభిప్రాయాలనూ మనం చేసిన పొరపాట్లనూ గుర్తుచేసుకుంటూ- అటువంటివి పునరావృతం కాకుండా, ఒకరినొకరం అర్థం చేసుకుంటూ ఉన్నంతలో ఆనందంగా, తృప్తిగా జీవించాలనుకున్నాం. ప్రతి పెళ్ళిరోజునూ హోటల్‌లో తిని, సినిమా చూసి మామూలుగా సాదాసీదాగా గడపటం కాకుండా ఆరోజు ఏదో ఒక వృద్ధాశ్రమానికి వెళ్ళి, అక్కడ వారితో కాసేపు గడిపి, వాళ్ళు తినేవేవైనా ఇచ్చి రావాలనుకున్నాం. ఇన్నేళ్ళుగా అలాగే చేస్తున్నాం.

సంసార రథానికి భార్యాభర్తలు రెండు చక్రాల్లాంటివాళ్ళు. రెండు చక్రాలూ సమంగా పనిచేస్తేనే రథం సజావుగా సాగుతుంది. ఏడాదికేడాదికీ మనమధ్య అవగాహన పెరుగుతున్నదనీ అదే అర్థవంతమైన దాంపత్యానికి పునాది అనీ మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను.

మన అల్లుడు భాస్కర్ మంచివాడు. ఆలోచనాపరుడు. మన శుభకు కొంచెం ఆవేశం ఎక్కువ. ఏదో మాటామాటా అనుకుని ఉంటారు. వాళ్ళమధ్య ఈ దూరం పెరగకూడదు. నేను వాళ్ళిద్దరితో విడివిడిగా మాట్లాడతాను. వీలైనంత త్వరలో సెలవుపెట్టి వస్తాను. ఇద్దరం కలిసి పరిస్థితులు చక్కబెడదాం. ధైర్యంగా, నిశ్చింతగా ఉండు, సరేనా. ఉంటా మరి.

ప్రేమతో
నీ శివ ★

ఇష్టమైన హీరో సినిమా విడుదలైతే ఏం చేస్తారు? తొలిరోజు, తొలి ప్రదర్శనకు బ్లాకులో అయినా టికెట్ కొనుక్కుని చూసేస్తారు కదా! ఆ హీరో విదేశీయుడైతే..? వీసా తీసుకుని విమానం టికెట్ కొనుక్కుని విదేశాలకెళ్లి సినిమా చూసి రాగలరా? జపాన్ వాళ్లయితే అలాగే చేస్తారు మరి!

# రజనీ కోసం... నేర్చారు తమిళం!

సూపర్‌స్టార్ రజనీకాంత్ ఏనాడూ జపాన్ వెళ్లలేదు. కానీ అక్కడి ఆయన అభిమానులు మాత్రం చాలాసార్లు ఇండియా వచ్చారు. రజనీ సినిమా చూడడానికి! వీలైతే ఆయనతో ఓ ఫొటో దిగడానికి. 'కబాలి' సినిమా విడుదల రోజున చెన్నై థియేటర్ల వద్ద రజనీ ఫ్యాన్స్ సందడిలో జపాన్ నుంచి వచ్చినవారు ప్రత్యేక ఆకర్షణగా నిలిచారు. కేవలం ఓ సినిమా చూడడానికి ఇంత దూరం వచ్చారంటే వారికెంత అభిమానం ఉండాలి? ఆ అభిమానానికి దారి తీసిన పరిస్థితులే మిటో టోక్యోలో రజనీ ఫ్యాన్స్ క్లబ్ తొలి సభ్యురాలి మాటల్లో చూడండి...

### 'ముత్తు' మత్తు ఇది!

'నా పేరు నొరికో ఇనగాకి. 1998లో రజనీకాంత్ సినిమా 'ముత్తు' తొలిసారి జపాన్‌లో విడుదలైంది. అప్పటికి మా దృష్టిలో రజనీకాంత్ అంటే ఓ మామూలు మధ్యవయసు హీరో, అంతే. పోస్టర్లమీద అందమైన అమ్మాయి మీనా మొహం చూసి చాలామంది థియేటర్‌కి వెళ్లారు. ఆ తర్వాత కొన్ని వారాలపాటు వెళ్తూనే ఉన్నారు. ఎప్పుడూ థియేటర్‌కెళ్లి సినిమా చూడనివారు కూడా ఆ సినిమా చూశారు. రజనీ నవ్వూ స్టైలూ స్క్రీన్ ప్రెజెన్స్... అన్నీ మా మనసు దోచేశాయి. ఆ తర్వాత కొన్ని బాలీవుడ్ సినిమాలు విడుదలైనా దేనికీ అంత వ్యాపారం జరగలేదు. 'ముత్తు' కేవలం హిట్ సినిమా కాదు, అది ఒక సంచలనం. థియేటర్లలో 23 వారాలు ఆడింది. ప్రైవేటు టీవీ ఛానల్స్‌తో పాటు జాతీయ టెలివిజన్‌లో కూడా ఆ చిత్రం ప్రసారమైంది. డీవీడీలు కొనుక్కున్నాం. నిజానికి అప్పుడు నేను ఉద్యోగం కోల్పోయి విచారంగా ఉన్నా. సినిమా చూసిన కొన్నాళ్లకే ఉద్యోగం వచ్చింది. ఆ తర్వాత రజనీ సినిమా చూసినప్పుడల్లా నాకు జీవితంలో ఏదో ఒక సానుకూల అంశం కన్పిస్తోంది. అలా రజనీ నాకు గురువయ్యాడు. చెన్నై వెళ్లి 'బాబా' చూశా. 'చంద్రముఖి' చూడడానికి సింగపూర్, 'శివాజీ' కోసం కౌలాలంపూర్... తిరుగుతూనే ఉన్నా. ప్రతిసారీ నాకో మంచి అవకాశం వస్తూనే ఉంది. రజనీ సినిమాలు మా దగ్గర విడుదల కాకపోయినా నాలాంటి అభిమానులు ఏదో రకంగా వాటిని చూస్తారు. ఆ సినిమాలు జపాన్‌లో విడుదల కాకపోవడం మార్కెటింగ్ లోపమే...' అంటుంది ఇనగాకి.

జపాన్‌లో రజనీకాంత్ పేరు తెలియని వారుండరు. ప్రజాదరణలో ఆయనని 'టైటానిక్' హీరో లియోనార్డో డికాప్రియోతో పోల్చింది న్యూస్‌వీక్ పత్రిక. 'ముత్తు' సినిమాపై అక్కడి అభిమానులు పీహెచ్‌డీ స్థాయి సమీక్షలు రాయగలరు. ఒక్కొక్కరూ సినిమాను ఎన్నిసార్లు చూశారో కానీ సాంకేతికత, ఎడిటింగ్, పాటలు, నృత్యాలు... అన్ని అంశాలనూ ఎంతో నిశితంగా విశ్లేషిస్తారు. ఆంగ్లం రాని వారు కూడా తమిళ డైలాగులు తడుముకోకుండా చెబుతారు. వారి సోషల్ మీడియా ఖాతాల్లో రజనీ డైలాగుల డబ్‌స్మాష్ వీడియోలు లెక్కలేనన్ని. 2006లో అప్పటి ప్రధాని మన్మోహన్ సింగ్ జపాన్ వెళ్లారు. వారి పార్లమెంటులో ప్రసంగిస్తూ ఆయన 'ముత్తు' ప్రస్తావన తేగా సభ్యులందరూ పెద్ద ఎత్తున హర్షధ్వానాలు చేశారు. ఆ ఒక్క సంఘటన చాలు రజనీ పట్ల జపనీయులకు ఎంత క్రేజ్ ఉందో చెప్పడానికి.

ఇటీవల రజనీ 'బాషా' సినిమాని రెండోసారి అన్ని దేశాల్లోనూ విడుదల చేశారు. తరచూ చెన్నై వచ్చి వెళ్తున్న జపాన్ అభిమానులు అచ్చం ఇక్కడి అభిమానుల్ని అనుకరిస్తూ బాషా విడుదలైన థియేటర్ల వద్ద రజనీ కటౌట్లకు పాలాభిషేకాలు చేశారట.

### ఆటో దిగుమతి చేసుకుని...

హిరొయొషి టకెడా రజనీ బొమ్మ ఉన్న టీషర్టు, దాని మీద ఖాకీ షర్టు వేసుకుంటాడు. ఇండియా నుంచి ప్రత్యేకంగా ఓ ఆటోను దిగుమతి చేసుకున్నాడు. అందులోనే తిరుగుతాడు. రజనీలా తలెగరేసి నృత్యం చేస్తాడు. రజనీ సినిమా మేనరిజాలన్నీ ప్రాక్టీసు చేసి ప్రదర్శిస్తూ ఉంటాడు. తమిళం నేర్చుకున్నాడు. స్నేహితుడితో కలిసి 'మసాలావాలా' పేరుతో దక్షిణ భారతీయ వంటకాల రెస్టరెంట్ నడుపుతున్నాడు. వంటకాలే కాదు, అక్కడ వడ్డన కూడా అరటి ఆకుల్లోనే. మికన్ అనే అభిమాని యువతీయువకులకు భారతీయ సినిమా నృత్యాలను నేర్పిస్తుంది. అట్సుకో అనే మరో అభిమాని హెన్నా ఆర్టిస్టుగా రాణిస్తోంది. ఒక్క టోక్యోలోనే రజనీ ఫ్యాన్ క్లబ్‌లో 3వేల మంది సభ్యులున్నారు. ఒసాకా, కోబె తదితర నగరాల్లోనూ రజనీ అభిమాన సంఘాలున్నాయి.

జపనీయుల సంస్కృతికి మూలమైన బౌద్ధం భారతదేశం నుంచి దిగుమతి అయిందే. ఇప్పుడు ఆ వారసత్వాన్ని రజనీ కొనసాగిస్తున్నాడంటూ అక్కడి పెద్దలు వ్యాఖ్యానించడం విశేషం. హీరో మీద అభిమానంతో తమ సంస్కృతీ సంప్రదాయాలను పక్కన పెట్టి మరీ కొత్త జీవనశైలిని అనుకరిస్తున్న ఈ జపనీయులు సినిమా హీరోల్లో రజనీకాంత్ ఎంత ప్రత్యేకమో, ఆయన అభిమానుల్లో మేమూ అంతే ప్రత్యేకం అని చాటుతున్నారు కదూ. ★









# అద్దం... అతికించేద్దాం!

**అద్దాలని అందాన్ని చూసుకోవడానికే కాదు, ఇంటిని చూడచక్కగా మార్చేందుకూ వాడుతున్నాం. అయితే, ఎంత అందంగా ఉన్నా మామూలు అద్దాలను కొన్ని చోట్లకే పరిమితం చెయ్యగలం. మరి, ఆ సొగసులు కావల్సిన చోటల్లా గోడల్ని తళుక్కుమనిపించాలంటే... ఈ అద్దాల స్టిక్కర్లను అంటించాల్సిందే.**

అద్దం... దాన్లో ప్రతిబింబించనిది ఏదీ ఉండదు. ఎదురుగా ఎంత చూడచక్కని వస్తువుంటే అది అంత చూడచక్కగా దర్శనమిస్తుంది. కాంతి కిరణాలనైతే రెట్టింపు ప్రకాశవంతంగా చేస్తుంది. అందుకే, ఆకర్షణీయంగా కనిపించే పెద్ద అద్దం ఒక్కటి ఉన్నా గది రూపు మారిపోతుంది. అలాంటిది వేరు వేరు ఆకృతుల్లోని చిన్నాపెద్దా అద్దాలను పేరుస్తూ గోడల్ని అలంకరిస్తే ఇంకెంత ముచ్చటగా ఉంటుందో ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. కానీ మామూలు అద్దాలను అన్ని ఎక్కువ అమర్చాలంటే చాలా శ్రమతోనూ ఖర్చుతోనూ కూడుకున్న పని. పైగా ఇల్లంతా మేకులు కొట్టాలి. ఇక, పొరపాటున ఏదైనా గట్టిగా వాటికి తగిలితే పగలడం ఖాయం. దాంతో ఉన్న అందం కూడా పోతుంది. అందుకే, పెద్దవి ఒకటీ రెండు అద్దాలను ఇంట్లో ఏదో మూల పెట్టడమే కానీ గోడంతా అద్దాలతో అలంకరించడం మన దగ్గర అంతగా ప్రాచుర్యం పొందలేదు. ఈ సమస్యకు పరిష్కారంగానే ఇప్పుడు మార్కెట్లోకి అద్దాల స్టిక్కర్లు వస్తున్నాయి. ఆక్రిలిక్‌తో చేసిన ఈ అద్దాలు రేకుల్లా పలుచగా ఉండి ఎక్కడైనా అంటించేందుకు వీలుగా ఉండడంతో పాటు, రకరకాల ఆకృతుల్లోనూ కత్తిరించి వస్తున్నాయి. ఇంకేముందీ... వీటితో గోడలు అద్దాల రంగవల్లులు అద్దుకుని ఇంటికి కొత్తందాన్ని తెస్తాయి. ఆక్రిలిక్ అద్దాల్లో మధ్యలో గడియారమూ దానిచుట్టూ చిన్నిచిన్ని అద్దాలతో ఉన్న డిజైన్లు మరోరకం. తక్కువ ఖర్చుతో అత్యాధునికంగా ఉండే ఈ అద్దాల స్టిక్కర్లను సింకు దగ్గరా బాత్‌రూమ్‌లోనూ మామూలు అద్దాలకు బదులుగా అంటిస్తే అటు అద్దమూ ఇటు అందమూ రెండు సొంతమవుతాయి.

## కాంతులీనే అందం

గొప్ప గొప్ప చిత్రలేఖనాలూ విలువైన కళాఖండాలూ చూడచక్కని బొమ్మలూ త్రీడీ స్టిక్కర్లూ... ఇంటి అలంకరణ అంటే చాలామందికి గుర్తొచ్చేవి ఇవే. కానీ కాస్త వెలుగు తక్కువ ఉండే గదుల్లో ఎంత గొప్ప కళాఖండాలను అమర్చినా వాటి అందం కనిపించదు. అలాంటి చోట అద్దాల అలంకరణ చేస్తే బాగా కనిపించడంతోపాటు అవి వెలుగుని ప్రతిబింబిస్తాయి కాబట్టి, గదిని ప్రకాశవంతంగానూ చేస్తాయి. అంతేకాదు, అద్దాల అందాలు పగలొకలా కనిపిస్తే రాత్రిపూట విద్యుద్దీపాల వెలుగులకు మిరుమిట్లు గొలిపే కాంతులతో మెరిసిపోతుంటాయి. ఇంకెందుకాలస్యం... అద్దాలతో ఇంటిని అలంకరించడం మొదలుపెట్టేద్దామా..? ★



# బాలవినోదిని

## జుట్టు భలే!

అరె జుట్టు విరబోసుకున్నట్టు కనిపిస్తోన్న ఈ జంతువేంటా అను కుంటున్నారా... అంత అనుమానం



అక్కర్లేదు ఇది కుక్కే. దీన్ని ఆఫ్ఘాన్ హౌండ్ అని పిలుస్తారు. ఆడవాళ్ల జట్టును పోలినట్లు తలమీద పొడవాటి వెంట్రుకలు ఉండటం వీటి ప్రత్యేకత. తోక మినహా ఒళ్లంతా ఉండే ఈ వెంట్రుకలు విపరీతమైన చలి, వేడిల నుంచి ఈ కుక్కలను కాపాడతాయి. ఆఫ్ఘాన్‌హౌండ్ గంటకు సుమారు 65 కిలోమీటర్ల వేగంతో పరిగెడు తుంది. అంటే ఒక రేసు గుర్రం పరిగెత్తేంత వేగం అన్నమాట. ప్రస్తుతం భూమిమీద ఉన్న అతి పురాతనమైన కుక్కల జాతిలో ఇదీ ఒకటట. 4000 ఏళ్లక్రితమే ఈ జాతి శునకాలు భూమ్మీద ఉన్నట్టు ఆధారా లున్నాయి. ప్రఖ్యాత చిత్రకారుడు పికాసో కూడా ఈ జాతి కుక్కను ఎంతో ప్రేమగా పెంచుకున్నాడట. చర్మంలో ఉండే ప్రత్యేక గ్రంథుల వల్ల వీటి నుంచి ఒకరకమైన సువాసన వస్తుందట. ఈ కుక్కలు ఎక్కువగా అఫ్ఘనిస్థాన్‌లో పెరుగుతాయి.

## అదేంటి?

ఇక్కడి బొమ్మల ఆంగ్ల పేర్లలో సూచించిన అక్షరాలను పక్కన ఉన్న ఖాళీ వృత్తాలలో వరుస క్రమంలో రాస్తే పక్షులకు సంబంధించిన ఒక పదం వస్తుంది. అదేంటో కనుక్కోండి?




## వేయగలరా?

కింది గళ్లలో కొన్ని రంగులు నింపి ఉన్నాయి కదా. వాటి ఆధారంగా ఈ గళ్లలో ఎరుపు, ఆకుపచ్చ, నీలం, గులాబీ, నారింజ, పసుపు రంగులు నింపాలి. అయితే అడ్డం, నిలువు వరుసల్లో ఒకసారి వచ్చిన రంగు మరోసారి రాకూడదు. ఒకే రంగు పక్కపక్కన రాకూడదు.



## ఏది భిన్నం?

పక్కన ఉన్న జీపుల్లో ఒకటి మిగతా వాటికి భిన్నంగా ఉంది. అది ఏదో కనిపెట్టారా?



## గప్‌చుప్



1. ఇక్కడ పిల్లలు తాము గీసిన బొమ్మలతో ఎగ్జిబిషన్ పెడుతున్నారు. ఇందులో ఒక ఫ్రేమ్‌లోని చిత్రాలతో మరో ఫ్రేమ్‌లోని చిత్రాలకూ సంబంధం ఉంది. వాటిని జతపరచండి.
2. పెయింటింగ్ ఫ్రేముల్లో చిన్నది ఏదో గుర్తించగలరా?
3. ఇక్కడ ఉన్న ఫ్రేముల్లో భిన్నంగా ఉన్నదేది?
4. ఇక్కడ ఉన్న వాటిలో రెండు రెండు ఫ్రేముల్ని కలిపితే ఒక చిత్రం వస్తుంది. ఆ ఫ్రేములేవి?
5. బొమ్మలో ఆంగ్ల 'W' అక్షరంతో మొదలయ్యే పదాలు చెప్పండి.

## స్వయంకృషి

మల్లయ్య ఒక భూస్వామి దగ్గర పనిచేసేవాడు. అతడికి జీతంగా డబ్బు ఇవ్వకుండా ఇల్లూ, తిండీ, బట్టా సమకూర్చేవాడు యజమాని. ఒకరోజు మల్లయ్య భార్య 'ఎంతకాలమని ఇలాగే ఉంటాం, మనమూ కాస్త పొలం కొనుక్కుని సాగుచేసుకుందాం' అంది. 'ఒక్క రూపాయి మన దగ్గర ఉన్నా ఏమైనా చేసేవాళ్లం. అన్ని ఖర్చులూ యజమానే చూసుకుంటున్నప్పుడు మళ్లీ డబ్బు అడగలేం కదా' అన్నాడు మల్లయ్య. అది విన్న యజమాని రూపాయి నాణేన్ని కావాలనే మల్లయ్య గుడిసె ముందు పెట్టి వెళ్లిపోయాడు. మల్లయ్య ఆ రూపాయిని తీసుకెళ్లి గుడిసె ముందు దొరికిందంటూ యజమానికి తిరిగివ్వబోతే, అతడు మల్లయ్య నిజాయతీకి సంతోషించి అతడినే తీసుకోమన్నాడు.



మల్లయ్య వెంటనే ఒక వడ్డీ వ్యాపారి దగ్గరకు వెళ్లి యాభై రూపాయలు అప్పు అడిగాడు. వడ్డీగా రూపాయిని వెంటనే చెల్లించాడు. ఆ యాభై తీసుకుని మరో పెద్ద వడ్డీ వ్యాపారి దగ్గరకు వెళ్లి అయిదు వేల రూపాయలు అప్పు అడిగాడు. అతడి కష్టపడేతత్వంముందే తెలియడంతో ఈ వ్యాపారీ వెంటనే అప్పు ఇచ్చాడు. నెలవడ్డీ యాభై రూపాయలను ముందుగానే చెల్లించి, అయిదువేలతో ఒక గేదెను కొన్నాడు మల్లయ్య. దాని పాలను అమ్మగా వచ్చిన డబ్బును జాగ్రత్తగా దాచిపెట్టి ఏడాది తిరిగేసరికి తీసుకున్న అప్పు పూర్తిగా చెల్లించేశాడు. ఆ తర్వాత పొదుపుచేసిన మొత్తంతో మరో రెండు గేదెలను కొన్నాడు. వాటి పాలు అమ్మితే వచ్చిన డబ్బుతో కొంత పొలం కొన్నాడు.

అలా స్వయంకృషితో కూలీ నుంచి రైతుగా ఎదిగాడు మల్లయ్య.

## పోలికలేంటి

ఇక్కడి బొమ్మల మధ్య అద్దం నిలువు, ఐమూలాగా ఉన్న పోలికలను కనుక్కోండి.




## అవునా!

మనందరికీ వేలిముద్రలు ఎలా వేరువేరుగా ఉంటాయో... అలాగే మన కనుపాప కూడా వేరుగానే ఉంటుంది. అందువల్లే ఇప్పుడు ఆధార్‌కార్డుల్లాంటివి ఇచ్చేందుకు కనుపాప ఫొటో తీసుకుంటున్నారు.




## దారికనుక్కోండి

తేనెటీగకు పువ్వును చేరే దారి చూపించండి.



## రంగులేద్దాం



## జవాబులు

గప్‌చుప్: 1. 4-6, 7-8, 1-12; 2. 5; 3. 9; 4. 3-9, 10-14; 5. wall clock, wall paper, wheel, window, whale, weines, well, wasp, worm, water, wood pecker, wall.

పోలికలేంటి: అద్దం: గ్రహాలు, మూడు మంట గొట్టాలు, ఒకే రంగు
నిలువు: రాకెట్ వెనుక భాగం డిజైన్, మూడు అద్దాలు, అక్షరాలు
ఐమూలాగా: యాంటెన్నా, త్రికోణాలు.

వేయగలరా?

ఏదిభిన్నం: 6

అదేంటి?: NEST

# మెంతి... మహా రుచి!

## మెంతి మటర్ మలై

**కావలసినవి**

మెంతికూర తురుము: 4 కప్పులు, తాజా బఠాణీలు: ముప్పావు కప్పు, ఉల్లిపాయ: ఒకటి, అల్లంవెల్లుల్లి: 2 టీస్పూన్లు, నూనె: 4 టేబుల్‌స్పూన్లు, ఎండుమిర్చి ముద్ద: టీస్పూను, ఆమ్‌చూర్‌పొడి: అరటీస్పూను, దాల్చినచెక్కపొడి: అరటీస్పూను, ఉప్పు: రుచికి సరిపడా, తాజా క్రీమ్: అరకప్పు



**తయారుచేసే విధానం**

★ ఉల్లిపాయను సన్నగా తరగాలి. మెంతికూరను శుభ్రంగా కడిగి, సన్నగా తరిగి ఉంచాలి.

★ తరవాత తరిగిన మెంతి కూరను మరిగించిన నీళ్లలో వేసి తీసి, ఓసారి చల్లని నీళ్లతో కడగాలి.

★ బాణలిలో నూనె వేసి ఉల్లిముక్కలు వేసి వేగాక, మెంతి కూర వేసి వేయించాలి. ఇప్పుడు అల్లంవెల్లుల్లి ముద్ద వేసి ఓ నిమిషం వేగాక, కారం, తాజా బఠాణీలు వేసి కలిపి ఉడికించాలి.

★ చివరగా ఆమ్‌చూర్ పొడి, దాల్చినచెక్క పొడి, ఉప్పు వేసి కలిపి రెండుమూడు నిమిషాలు సిమ్‌లో ఉడికించి, దించేముందు మీగడ వేసి కలపాలి.

## మెంతి కె గట్టె

**కావలసినవి**

**గట్టెకోసం:** సెనగపిండి: పావుకిలో, మెంతికూర తురుము: 4 కప్పులు, ఇంగువ: చిటికెడు, ఉప్పు: అరటీస్పూను, కారం: పావుటీస్పూను, దనియాలపొడి: టీస్పూను, నూనె: టేబుల్‌స్పూను, **గట్టె వేయించేందుకు:** నూనె: ఒకటిన్నర టేబుల్‌స్పూన్లు, జీలకర్ర: అరటీస్పూను, ఆవాలు: అరటీస్పూను, పచ్చిమిర్చి: రెండు, అల్లం తురుము: టీస్పూను, కొత్తిమీర తురుము: టేబుల్‌స్పూను, కారం: పావుటీస్పూను, ఉప్పు: అరటీస్పూను, ఆమ్‌చూర్‌పొడి: అరటీస్పూను, గరంమసాలా: పావుటీస్పూను

**తయారుచేసే విధానం**

★ కడిగి సన్నగా తరిగిన మెంతికూరను సెనగపిండిలో వేయాలి. ఉప్పు, కారం, దనియాలపొడి, ఇంగువ కూడా వేసి బాగా కలపాలి. కొద్దిగా నీళ్లు పోసి చపాతీ పిండిలా కలిపి మూతపెట్టి ఇరవై నిమిషాలు పక్కన ఉంచాలి. తరవాత ఈ పిండిని చిన్న చిన్న ఉండల్లా చేసి అర అంగుళం బిళ్లల్లా వత్తాలి. ఇలాగే అన్నీ చేసుకుని, అవి మునిగేలా నీళ్లు పోసి సుమారు పదిహేను నిమిషాలపాటు మరిగించాలి. చల్లారాక నీళ్లు వంపేసి ఈ గట్టెలను పక్కన ఉంచాలి. బాణలిలో నూనె వేసి జీలకర్ర, ఇంగువ, ఆవాలు వేసి చిటపటమన్నాక పచ్చిమిర్చి ముక్కలు, అల్లంతురుము, కొత్తిమీర తురుము వేసి కలపాలి. మసాలా వేగాక ఉడికించిన గట్టె, కారం, ఉప్పు, ఆమ్‌చూర్‌పొడి, గరంమసాలా వేసి నాలుగు నిమిషాలు వేయించి తీయాలి. వీటిని కూరలా అన్నం, చపాతీతోబాటు గానీ లేదా విడిగా ఏదైనా చట్నీతో తిన్నాగానీ బాగుంటాయి.




## మెంతి భాజీ

**కావలసినవి**

తాజా మెంతికూర: 3 కప్పులు, ఉల్లిపాయ: ఒకటి, పసుపు: అరటీస్పూను, వెల్లుల్లి: 4 రెబ్బలు, ఇంగువ: చిటికెడు, కారం: అరటీస్పూను, దనియాల పొడి: టీస్పూను, నిమ్మరసం: అరటీస్పూను, జీలకర్ర: అరటీస్పూను, ఉప్పు: రుచికి సరిపడా, నూనె: 2 టీస్పూన్లు



**తయారుచేసే విధానం**

★ ఆకుకూర కడిగి చిన్నగా తరగాలి. విడిగా బాణలిలో నూనె వేసి జీలకర్ర, సన్నగా తరిగిన ఉల్లి ముక్కలు, వెల్లుల్లి ముక్కలు, ఇంగువ, వేసి వేగాక, పసుపు, కారం, దనియాలపొడి, ఉప్పు వేసి కలపాలి. తరవాత మెంతి కూర వేసి నూనె తేలేవరకూ వేయించాలి. ఇప్పుడు పావుకప్పు నీళ్లు పోసి, నిమ్మరసం పోసి కలిపి మూతపెట్టి సిమ్‌లో ఉడికించి దించాలి.

## మెంతి-పెసరపప్పు

**కావలసినవి**

మెంతి కూర తురుము: 3 కప్పులు, పెసరపప్పు: కప్పు, నూనె: టీస్పూను, ఉప్పు: రుచికి సరిపడా, పచ్చిమిర్చి: నాలుగు, వెల్లుల్లి: 4 రెబ్బలు, జీలకర్ర: టీస్పూను



**తయారుచేసే విధానం**

★ వెల్లుల్లి కచ్చాపచ్చాగా నలగగొట్టాలి. పెసరపప్పు కడిగి సుమారు ఓ అరగంట నానబెట్టి, నీళ్లు వంపేయాలి.

★ బాణలిలో నూనె వేసి జీలకర్ర, వెల్లుల్లి వేసి వేగాక పచ్చిమిర్చి వేసి వేయించాలి. తరవాత సన్నగా తరిగిన మెంతి కూర, నానబెట్టిన పెసరపప్పు వేసి పది నిమిషాలు మూతపెట్టి, సిమ్‌లో ఉడికించి దించాలి.

## పన్నీర్ మెంతి చమన్

**కావలసినవి**

మెంతికూర తురుము: 2 కప్పులు, పాలకూర: 4 కప్పులు, వంటసోడా: చిటికెడు, జీలకర్ర: టీస్పూను, ఉల్లిముక్కలు: పావుకప్పు, ఇంగువ: చిటికెడు, పసుపు: చిటికెడు, కారం: పావుటీస్పూను, దనియాలపొడి: పావుటీస్పూను, పచ్చిమిర్చిముద్ద: అరటీస్పూను, అల్లంతురుము: అరటీస్పూను, కసూరిమెంతి: టీస్పూను, పన్నీర్ ముక్కలు: కప్పు, గరంమసాలా: పావుటీస్పూను, నూనె: 2 టేబుల్‌స్పూన్లు, ఉప్పు: రుచికి సరిపడా

**తయారుచేసే విధానం**

★ తరిగిన పాలకూర, మెంతికూరలో కొద్దిగా నీళ్లు పోసి చిటికెడు సోడా వేసి ఉడికించి దించాలి. తరవాత వీటిని మిక్సీలో వేసి మెత్తగా రుబ్బాలి.

★ చిన్న బాణలిలో కసూరి మెంతి వేసి వేయించి పక్కన ఉంచాలి.

★ పాన్‌లో నూనె వేసి కాగాక జీలకర్ర వేసి వేయించాలి. తరవాత ఉల్లిముక్కలు కూడా వేసి ఓ నిమిషం వేగాక, ఇంగువ, కారం, పసుపు, దనియాలపొడి, పచ్చిమిర్చి ముద్ద, అల్లంముద్ద, కసూరి మెంతి వేసి వేగనివ్వాలి. ఇప్పుడు రుబ్బిన ఆకు మిశ్రమాన్ని వేసి, పన్నీర్ ముక్కలు, గరంమసాలా వేసి కలపాలి. సుమారు అరకప్పు నీళ్లు పోసి దగ్గరగా ఉడికించి దించాలి.







దేశభక్తితోనో, భుక్తికోసమో... సైన్యంలో చేరతారు యువకులు. విధినిర్వహణలో ప్రాణాలూ అర్పిస్తారు. ఆ తర్వాత? కన్నబిడ్డను కోల్పోయి తల్లిదండ్రులూ, భాగస్వామిని కోల్పోయి భార్యా పడే కష్టాలు ఇన్నీ అన్నీ కావు. ప్రభుత్వం నుంచి అందాల్సినవేంటో వారికి తెలియదు. ఎలా బతకాలో అర్థం కాదు. అలాంటి అమాయకులకు అండగా నిలుస్తోంది హైదరాబాద్‌లోని ఈ సంస్థ.



# 3 లక్షలు వెనక్కివ్వమన్నారు... 17లక్షలు ఎదురిచ్చారు!



సుల్తానా

షాహీన్ సుల్తానా భర్త భారత సైనికుడిగా చైనా, పాకిస్థాన్‌లతో జరిగిన మూడు యుద్ధాల్లో పాల్గొన్నారు. 45 ఏళ్లకే స్వచ్ఛంద పదవీ విరమణ చేసిన ఆయన ఆ తర్వాత మూడు నెల్లకే గుండెనొప్పితో మరణించారు. 1974 నాటి సంగతిది. 36 ఏళ్ల వయసులో ఒంటరైన సుల్తానా వచ్చే కొద్దిపాటి పింఛన్‌కి తోడు ఓ ప్రీస్కూల్ నిర్వహిస్తూ పిల్లలిద్దర్నీ చదివించి పెద్దచేశారు. ప్రస్తుతం ఒంటరిగా హైదరాబాద్‌లో నివసిస్తున్న ఆమెకు 2016లో ఓ నోటీసు అందింది. ఆమెకు పెన్షన్ ఎక్కువగా చెల్లించామనీ రూ.3 లక్షలు తిరిగి చెల్లించమనీ దాని సారాంశం. అది చూసి హతాశురాలైన సుల్తానా న్యాయం చేయమంటూ అధికారులను సంప్రదించారు. మాజీ జనరల్ యోగి శర్మ ఆ వృద్ధురాలిని టీసేవా సంఘం వద్దకు తీసుకెళ్లారు. వారు సుల్తానా భర్త మొయిదు కేసు పూర్తి వివరాలు సేకరించారు. 26 ఏళ్ల రికార్డులూ రసీదులూ అన్నీ తిరగేస్తే తేలిందేమిటంటే ఆమెకే రూ.17 లక్షల బకాయిలు చెల్లించాల్సి ఉందని. ఆ వివరాలన్నీ తెలుపుతూ బ్యాంకువారికీ, పింఛను కార్యాలయానికీ లేఖలు రాసి టీసేవా సంఘం సుల్తానాకి న్యాయంగా అందవలసిన బకాయిలు మొత్తం అందేలా చేసింది. వారి సహాయమే లేకపోతే తనకు జరిగిన అన్యాయం ఎప్పటికీ తెలిసేది కాదనీ, పైగా వాళ్లు అడిగిన 3 లక్షలు చెల్లించడానికి తాను చాలా అవస్థ పడాల్సి వచ్చేదనీ అంటారు సుల్తానా.

### ఇలాంటివారు ఎందరో...

విజయనగరం జిల్లాకి చెందిన శ్రీవాణి భర్త 2010లో కశ్మీర్‌లో విధినిర్వహణలో ప్రాణాలు కోల్పోయారు. ప్రభుత్వం నుంచి అందే సహాయం ఏమిటో ఎలా తీసుకోవాలో ఆమెకు తెలియదు. టీసేవా సంఘం ఆ సహాయాలన్నీ అందేలా చేసింది. విరాళాల రూపంలో కొంత డబ్బు సేకరించి ఇచ్చింది. ఆమెకు రాష్ట్రప్రభుత్వ ఉద్యోగం, పిల్లలకు పాఠశాలల్లో సీట్లు... ఇలా అన్ని ఏర్పాట్లూ చేసింది. డెహ్రాడూన్‌కి చెందిన సుబేదార్ ఛేత్రి విధినిర్వహణలో ప్రాణం కోల్పోయారు. తక్కువ పెన్షన్‌తో ఇద్దరు పిల్లలతో అతని భార్య పడుతున్న అవస్థలు చూసి ఓ సైన్యాధికారి టీసేవ దృష్టికి తెచ్చారు. టీసేవ సభ్యులు డెహ్రాడూన్ వెళ్లి ఛేత్రికి సంబంధించిన రికార్డులన్నీ పరిశీలించి అతని భార్యకు రావాల్సిన రూ.15లక్షల బకాయిలను ఇప్పించారు. కూర్గ్‌కి చెందిన కావేరి, కార్గిల్ వీరుడి భార్య శకుంతలా భండార్కర్, కేరళకు చెందిన తంకమ్మ, సల్మా ఘోరీ, రంజనీ మోహన్... ఇలా ఎందరో అమర వీరుల కుటుంబాలకు చెందినవారు టీసేవా సంఘం సహాయంతో ప్రభుత్వం నుంచి తమకు న్యాయంగా అందాల్సిన నిధులను అందుకున్నారు. అలా ఇప్పటివరకూ 102 కుటుంబాలకు రూ.3.45 కోట్ల బకాయిలను ఇప్పించింది టీసేవ.

### ఏమిటీ టీసేవ?

హైదరాబాదులో రెండేళ్ల క్రితమే ఏర్పడిన ఈ త్రివిధ దళాల మాజీ సైనికుల సంక్షేమ సంఘం(ట్రైసర్వీసెస్ ఎక్స్ సర్వీస్‌మెన్ వెల్ఫేర్ అసోసియేషన్) తక్కువ సమయంలోనే తెలుగురాష్ట్రాల్లోనే కాక దేశంలోని ఇతర రాష్ట్రాల్లో నివసిస్తున్నవారినీ ఆదుకుంటున్న తీరు అభినందనీయం. దేశవ్యాప్తంగా ఈ సంఘంలో 6,500 మంది మాజీ సైనికులు సభ్యులయ్యారు. త్రివిధ దళాల్లో పనిచేస్తూ ప్రాణాలు కోల్పోయిన సైనికుల కుటుంబాలకూ, విశ్రాంత సైనికులకూ అందాల్సిన అన్నిరకాల సహాయాలూ సరిగ్గా అందేలా వీరు చర్యలు తీసుకుంటున్నారు.

పదిహేను మంది విశ్రాంత సైనికాధికారులూ, కెప్టెన్ ఆనంద్ భార్య పింకీ ఆనంద్ కలిసి టీసేవా సంఘాన్ని ఏర్పాటుచేశారు. మారుమూల పల్లెల నుంచి ఎందరో యువకులు సైన్యంలో చేరతారనీ, వారికి దేశభక్తితో ప్రాణాలర్పించడమే తెలుసు కానీ ఆ తర్వాత తమ కుటుంబాల పరిస్థితి గురించి ఆలోచించడం తెలియదనీ అంటారు వీరు. అలాంటి వారి కుటుంబసభ్యులకు తమకు న్యాయంగా ప్రభుత్వంనుంచి ఏయే సదుపాయాలు లభిస్తాయో కూడా తెలియదనీ చాలామంది నామమాత్రపు పింఛనుతో నిస్సహాయంగా గడుపుతున్నారనీ టీసేవ సభ్యులు తెలిపారు. వారి తరఫున బ్యాంకులతో, త్రివిధ దళాల రికార్డు ఆఫీసులు, పింఛను కార్యాలయ అధికారులతో మాట్లాడి న్యాయంగా అందాల్సిన పింఛను, ఇతర సౌకర్యాలు కల్పించేందుకు టీసేవ సభ్యులు కృషిచేస్తున్నారు. అవసరమైన చోట రక్షణదళాల ట్రిబ్యునల్ వద్దా సుప్రీంకోర్టులోనూ న్యాయపోరాటమూ చేస్తున్నారు.

ఆరో సీపీసీ అవార్డ్సు, ఒకే హోదా- ఒకే పింఛను విధానాల్లో భాగంగా రావాల్సిన ప్రయోజనాల మదింపులో కచ్చితమైన సమాచారాన్ని అందించడానికి ప్రత్యేక సాఫ్ట్‌వేర్‌తో వెబ్‌సైట్‌ను కూడా ఏర్పాటుచేశారు. సైనికుల కుటుంబాలకు ప్రభుత్వం నుంచి రావలసిన సొమ్ము ఇప్పించడంతోనే వీరు తమ బాధ్యత తీరిపోయిందనుకోవడం లేదు. అవసరమైన చోట తామే చొరవ చూపి విరాళాలు సేకరించి మరీ ఆర్థికసాయం అందిస్తున్నారు. అనాథాశ్రమాలకూ, వృద్ధాశ్రమాలకూ, పాఠశాలలకూ కూడా ఆర్థిక సహాయం అందిస్తున్న వీరు అభినందనీయులు కదూ. ★



# రాశి ఫలం

గ్రహబలం (సెప్టెంబరు 3 - 9)



డా॥ శంకరమంచి రామకృష్ణ శాస్త్రి



## మేషం అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం

బుద్ధిబలంతో విజయం లభిస్తుంది. ఒత్తిడి అధికమవుతుంది. పనిలో ఏకాగ్రత పెంచండి. బంధువులతో సంతోషంగా గడుపుతారు. పెద్దలవల్ల లాభాలు చేకూరతాయి. అభీష్టం నెరవేరుతుంది. విఘ్నాలున్నాయి. ఆవేశం పనికిరాదు. చిన్న చిన్న సమస్యలు చికాకు కలిగిస్తాయి. శుభవార్త వింటారు. ఆరోగ్యం విషయంలో శ్రద్ధ అవసరం. దత్తాత్రేయ స్తుతి మంచి చేస్తుంది.



## వృషభం కృత్తిక 2,3,4 పాదాలు; రోహిణి, మృగశిర 1,2 పాదాలు

సౌభాగ్యసిద్ధి ఉంటుంది. ప్రశాంతమైన మనసుతో ముందుకు సాగండి. విశేషమైన వ్యాపారయోగం ఉంది. పనుల్లో ఇతరుల సహాయ సహకారాలు పుష్కలంగా లభిస్తాయి. అనుకున్న పనులు త్వరగా పూర్తిచేయగలుగుతారు. ప్రశాంతంగా జీవనం కొనసాగుతుంది. ఆర్థికంగా బలపడతారు. పదవీలాభం ఉంది. ఆంజనేయస్వామి ధ్యానం ఉత్తమం.



## మిథునం మృగశిర 3, 4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పాదాలు

ఆనందంగా వారం మొదలవుతుంది. బంధుజన సమాగమం. ఇష్ట కార్యసిద్ధి. ఉత్తమ భవిష్యత్తుకు కార్యాచరణ రూపొందిస్తారు. ఆర్థిక ప్రయోజనాలు చేకూరతాయి. అలసటగా అనిపిస్తుంది. విశ్రాంతి అవసరం. సన్మానాలున్నాయి. తెగిపోయిన బంధాలు తిరిగి బలపడతాయి. ఉద్యోగ, వ్యాపారాల్లో సుహృద్భావ వాతావరణం ఉంటుంది. ఇష్టదేవతా స్మరణ మంచిది.



## కర్కాటకం పునర్వసు 4వ పాదం; పుష్యమి, ఆశ్లేష

పట్టుదలతో పనిచేస్తే కార్యాలు సిద్ధిస్తాయి. సంకల్పబలంతో విజయం లభిస్తుంది. దూషించిన వారే కీర్తిస్తారు. దైవబలంతో ఒక పని పూర్తిచేస్తారు. ధనలాభం ఉంది, అయితే ఖర్చు పెరగకుండా జాగ్రత్తపడాలి. కుటుంబసభ్యుల సూచనలు పనిచేస్తాయి. పండితులతో సద్గోష్ఠి జరుగుతుంది. ఉద్యోగంలో శుభఫలితాలున్నాయి. ఆదిత్య హృదయం చదువుకోవాలి.



## సింహం మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం

ఉత్సాహంగా ఆలోచిస్తే విజయం లభిస్తుంది. ఆటంకాలను అధిగమిస్తారు. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాల్లో కలిసి వస్తుంది. శ్రమ పెరుగుతుంది. అనాలోచిత నిర్ణయాల వల్ల అపార్థాలకు అవకాశమిస్తారు. కుటుంబసభ్యుల ప్రమేయంతో అన్నీ తొలగిపోతాయి. పనిలో నైపుణ్యం లభిస్తుంది. ఆర్థిక ఇబ్బందులు తొలగే మార్గం దొరుకుతుంది. శివాష్టోత్తరం పఠించాలి.



## కన్య ఉత్తర 2, 3, 4 పాదాలు; హస్త, చిత్త 1, 2 పాదాలు

విశేషమైన కార్యసిద్ధి ఉంది. ఆత్మవిశ్వాసంతో చేసే పనులు సత్ఫలితాన్నిస్తాయి. జటిలమైన సమస్యలని బుద్ధిబలంతో ఛేదిస్తారు. మిత్రుల సలహాతో ఒక విషయంలో అనుకూల ఫలితం వస్తుంది. మరింత శ్రద్ధతో పనిచేస్తే అద్భుతమైన భవిష్యత్తు లభిస్తుంది. ఉద్యోగంలో శుభ పరిణామాలు చోటుచేసుకుంటాయి. ధనలాభం ఉంది. లక్ష్మీ అష్టోత్తరం చదవండి.



## తుల చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు

కల సాకారమవుతుంది. ఆశయం నెరవేరుతుంది. కష్టపడి పనిచేసి లాభాన్ని పొందుతారు. ధైర్యంగా నిర్ణయాలు తీసుకోండి. గృహంలో శుభాలు జరుగుతాయి. పేరు ప్రతిష్ఠలు సంపాదిస్తారు. చేయని పొరపాటుకు ఫలితం అనుభవించాల్సి రావచ్చు. స్పష్టంగా మాట్లాడటం వల్ల అపోహలు తొలగుతాయి. మానసిక ప్రశాంతతకు విష్ణు సహస్రనామం పారాయణం చేయండి.



## వృశ్చికం విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ

అదృష్టకాలం మొదలైంది. ఏ పని ప్రారంభించినా శుభ ఫలితమే సిద్ధిస్తుంది. విశేష ధనలాభాలున్నాయి. ఖర్చులు తగ్గించే ప్రయత్నం జరగాలి. సంకల్పశక్తితో బ్రహ్మాండమైన భవిష్యత్తుకు బాటలు వేస్తారు. ఆత్మవిశ్వాసం మిమ్మల్ని ముందుకు నడుపుతుంది. కుటుంబసభ్యులకు కలిసివచ్చే కాలం. గృహలాభం, వాహన సౌఖ్యాలున్నాయి. ఇష్టదైవాన్ని స్మరించండి.



## ధనుస్సు మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం

మనోబలంతో పనిచేస్తే శీఘ్ర విజయం లభిస్తుంది. విఘ్నాలు అధికంగా ఉన్నాయి. ముఖ్య కార్యాల్లో తగినంత శ్రద్ధ అవసరం. అపార్థాలకు అవకాశముంది. మనసులోని భావాలను స్పష్టంగా ప్రకటించాలి. అవమానాలను తట్టుకుని పనిలో కీర్తిని సాధిస్తారు. ఒత్తిడి కలగకుండా పనిచేస్తే ఉద్యోగంలో ప్రశంసలున్నాయి. ఆరోగ్యం కాపాడుకోవాలి. విష్ణుసహస్రనామం చదవండి.



## మకరం ఉత్తరాషాఢ 2, 3, 4 పాదాలు; శ్రవణం, ధనిష్ఠ 1, 2 పాదాలు

ఎంత శ్రద్ధ పెడితే అంత ఉత్తమ ప్రతిఫలం ఉంటుంది. విమర్శలకు ప్రతి విమర్శలు చేయవద్దు. కాలం సద్వినియోగం అయ్యే విధంగా పనులు చేయండి. దైవబలంతో ఒక ఆపద నుంచి బయటపడతారు. కోరికలు నెరవేరతాయి. ఆందోళన చెందే పరిస్థితులున్నా మిత్రుల వల్ల ప్రశాంత వాతావరణం లభిస్తుంది. ఆర్థిక విషయాల్లో జాగ్రత్త. మహాలక్ష్మీ అష్టకం చదువుకోవాలి.



## కుంభం ధనిష్ఠ 3, 4 పాదాలు; శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు

స్పష్టమైన ఆలోచనా విధానంతో పనులు పూర్తి అవుతాయి. సమయం వృథా కాకుండా చూడాలి. విభేదించేవారు పెరుగుతారు. శాంతంగా మాట్లాడండి. ఉద్యోగ యోగం ఉంది. చిత్తశుద్ధి విజయాన్నిస్తుంది. మీ ధర్మం మిమ్మల్ని సదా కాపాడుతుంది. అధికారుల నుంచి ఒత్తిడి తగ్గుతుంది. కుటుంబ సభ్యులతో మాటపట్టింపులకు పోవద్దు. సూర్యస్తుతి శుభప్రదం.



## మీనం పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి

అదృష్టయోగం పడుతుంది. అద్భుతమైన శుభకాలం నడుస్తోంది. కాలాన్ని సద్వినియోగం చేసుకోండి. అనుకున్నది సాధిస్తారు. మిత్రుల సహకారం ఉంటుంది. చేస్తున్న పనుల్లో అనేక విధాలుగా లాభపడతారు. ధనబలం పెరుగుతుంది. ఖర్చులు అదుపులో ఉంటాయి. భూ, గృహ యోగాలున్నాయి. ముఖ్య నిర్ణయాలను జాగ్రత్తగా ఆలోచించి తీసుకోవాలి. అష్టలక్ష్మీ ధ్యానం శుభదాయకం.

